శ్రీ

# ధన్వంతరివిజయము

ఇది

హరిప్రసాద లబ్ధవైద్యవిద్యాధురీణుం

డగు

చినబైరాగియోగివిరచితము.

కృష్ణాజిల్లా ఏలూరు, బుక్కుసెల్లరు,

కర్రా వేంకటరత్నముచే

రాజమండ్రి

శ్రీవిద్యానిలయముద్రాక్షరశాలయందు ముద్రింపించి
ప్రకటింపఁబడెను.

మూఁడవకూర్పు, 1000 ప్రతులు.

1919

దీని వెల 8 అణాలు.

కాపీరైటు కర్రా వేంకటరత్నముచే ట్రాన్స్ఫరు పొందఁబడినది.

# ప్రథమ పీఠిక.

ఆర్యులారా !

ధన్వంతరి విజయమను నీపురాతనగ్రంథమును లోకోపకారార్థము ముద్రింపించి ప్రకటింపఁదలకొంటిని.

ఇందుగల యోగములన్నియును ప్రసిద్ధములును, వైద్యులకెల్లరకు సులభసాధ్యముగా నుండుటయేగాక ప్రతిపట్నములోను, పల్లెటిగ్రామముల యందును గలవైద్యేతరులుగూడ దీనిననుసరించి యౌషధములన్నియు ప్రశస్తముగా తయారుచేసికొనుటకును, దీనివలన నమితమగు లాభమునుగూడఁబొందుటకును వీలుగలిగియున్నది.

బసవరాజీయము, చింతామణిమొదలగు సద్గ్రంథములెంతెంతయుపకారములుగానున్నవో ఈగ్రంథమును, అంతయుపకారిగానున్నను గ్రంథము వెలయధికమయినచో సర్వజనసాధారణముగా విలుచుటకు వీలుండదనుతలఁపుతో బహుస్వల్పక్రయమునకే చిక్కునట్లు ఏర్పరచియున్నాను.

ఈగ్రంథము నాలుగాశ్వాసములుగా చక్కని వివరములతో వ్రాయబడియుండుటయేగాక, సుబోధముగా నుండునట్లు తాత్పర్యముగూడ వ్రాయబడియున్నది.

ప్రతిదినమును అనేకౌషధములఁ దయారుచేయుచుండు వైద్యులకుఁ జెప్పవలసినది లేకున్నను నవీను లీయోగములంబట్టి యౌషధములు చేయునప్పుడు రసవిషగంధకాదుల శుద్ధులుమాత్రము జాగ్రతగాఁ జేసిమఱియు వాడుకొనవలెనని కోరుచున్నాను.

ఇట్లు, విధేయుఁడు,

కర్రా వేంకటరత్నము.

# ద్వితీయముద్రణ పీఠిక.

---

భారతదేశసోదరులారా !

మనదేశమునఁ బూర్వము పెక్కండ్రు వైద్యశాస్త్రనిపుణతవడసి యమోఘప్రయోగములగు నౌషధరాజములను గ్రహించి స్వదేశసోదరులకు దేహారోగ్యలబ్ధినిఁ గలుగఁజేయుచుండెడివారు తమతరువాత నుద్భవించువారలకుపయుక్తములగునటు లనేక వైద్యగ్రంథరచనముగూడఁ గావించిరి. ఇప్పుడాంగ్లేయప్రభుత్వసౌకర్యములలో నొకటియగుముద్రణాయంత్రసహాయమునఁ బూర్వకవిరచితవైద్యగ్రంథములలో ననేకములు ముద్రితములయి బహుజనకరస్థములయి యలరుచున్నవి. కాని గ్రంథబాహుళ్యభీతిచేతను నిరక్షరకుక్షిత్వము చేతను పండితులుఁ బామరులుగూడ నాపుస్తకములవంకఁజూడక స్వేచ్ఛావృత్తిని వైద్యములు నడుపువారు పెక్కురుగలరు. అందుచేత వైద్యాపేక్షితులగు గృహస్థులకు మిక్కిలిచెడుగు సంభవించుచున్నది. ఈయోగివర్యుఁడగు చినబైరాగిచే రచియింపఁబడిన యీ "ధన్వంతరివిజయ" మను గ్రంథరాజము ప్రతిగృహమున నొక్కొకటి వెలసినచో నవిద్యవైద్యులవలని బాధతప్పుటయే గాక స్వయముగా రోగరహితమును గావించుకొనుట కీగ్రంథమే వైద్యుఁడుగా నుపయోగపడును. ఇట్టియుపయోగకరమగుపుస్తకమును బునర్ముద్రణములోనికిఁ దెచ్చిన కర్త్రి వేంకటరత్నమెంతయు స్తుతిపాత్రుఁడు. కవిత్వమునచ్చటచ్చట దోషములున్నను విషయములు బాగుగా వ్యక్తీకరింపఁబడినవి.

ఇట్లు బుధవిధేయుఁడు

కాశీనాథుని వీరమల్లయారాధ్యుఁడు.

ఏలూరు.

ఓమ్.

# శ్రీ సద్గురవేనమః.

మ. అపనిమ్నర్త్యుల మొక్కులందిదయతో నారోగ్యమున్ లోకబాం
ధవుఁడైయిచ్చుచు దవ్వుఁజెందియుఁను మిత్రఖ్యాతిఁ బెంపొంది వేఁ
డివెలుంగుంగల దయ్యుమయ్యుఁ బరిపాటి శీతలాంభఃప్రదుం
డవు నారాయణమూర్తిఁ బ్రోచెడిని నిత్యంబున్ జగచ్ఛత్రుఁడై.

శ్లో. గురుర్బ్రహ్మగురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః,
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మైశ్రీగురవేనమః.

## మంత్రము.

ఏవంగుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ, గోత్రస్య, నామధేయస్య ఆయుష్యాభివృద్ధ్యర్ధం శ్రీసూర్యనారాయణ నమస్కారం కరిష్యే.

శరీరేవర్తమాన వర్తిష్యమాణ వాతపిత్త కఫోద్భవ నానాకారణ జ్వర, క్షయ, కుష్టు, శూలాతిసార, పాండు, ధాతుక్షయ, వ్రణ, మేహ, భగంధ రాదిసమస్తామయ నిబర్హణార్ధం హరిహరనామాత్మక త్రయీమూర్తయే భాగవతే ఛాయాసమేత శ్రీసూర్యనారాయణ నమస్కారం కరిష్యే.

శ్లో. ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణస్సరసిజాసనసన్నివిష్టః.
కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటహారీ హిరణ్మయవపుర్ధృతశంఖచక్రః.

శ్లో. భానోభాస్కరమార్తాండ చండరశ్మిదివాకరః,
ఆరోగ్యమాయుర్విజయం శ్రేయఃపుత్రాంసిదేహిమే.

శ్లో. ఆదిదేవనమస్తుభ్యం ప్రసీదమమభాస్కర,
దివాకర నమస్తుభ్యం ప్రభాకర నమోస్తుతే.

## మంత్రము.

మిత్ర, రవి, సూర్య, భాను, ఖగ. పూష, హిరణ్యగర్భ, మరీచదోన మః, ఆత్మప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి.

## మూలము.

హ్రాం, హ్రీం, హ్రూం, హ్రేం, హ్రైం, హ్రౌం, హ్రః, శ్రీఛాయాపద్మినీఉషాసమేత శ్రీసూర్యనారాయణ పరబ్రహ్మణేనమః. నమస్కారాన్ సమర్పయామి

౧౦౮ సారులు జపముచేయవలెను.

# వి ష య సూ చి క.

## ప్రథమాశ్వాసము.

పుటసంఖ్య.



## ద్వితీయాశ్వాసము.

## తృతీయాశ్వాసము.

## చతుర్థాశ్వాసము.

శ్రీ

శుభమస్తు.

# ధన్వంతరివిజయము

SRI VEMANA BHASHA NILAYAM
శ్రీ వేమన ఆంధ్ర భాషా నిలయము దక్షిణ హైదరాబాదు
HYDERABAD-DN.

## ప్రథమాశ్వాసము.

### ఇష్టదేవతాప్రార్థనము.

సీ. శ్రీవిష్ణుమూర్తిని సేవజేయుచునుందు శరణుజొచ్చితి సయ్య శంబునకును
బ్రహ్మదేవుని నెప్డుఁ బ్రార్థనజేసెద విఘ్ననాయకుపూజ విడువకుందు
ధన్వంతరిపదముల్ తప్పక గొల్చెద మ్రొక్కుదశ్వినులకు మోదమలర
సకలలోకకవుల సన్నుతిజేసెద భారతి నినుచాల బ్రస్తుతింప
గీ. శబ్దశాస్త్రంబు ఛందస్సు చదువలేదు, సన్మతిని నన్ను రక్షించు నెమ్మనమున
చిత్తగింపుము మనవిని శీఘ్రముగను, వాక్కుదయచేయుమమ్మ యోవాణివేగ

తా. శ్రీమన్నారాయణమూర్తిని సదా సేవజేయుచున్నాను. ఓసాంబశివమూర్తీ నీకు శరణుజేయుచున్నాను. ఓ బ్రహ్మదేవ నిన్ను ఎల్లప్పుడును నేను ప్రార్థనజేయుచున్నాను. ఓవిఘ్నేశ్వరుడా నీపూజవిడువకుండఁజేయుచున్నాను. అయ్యా ధన్వంతరీ తమపాదములు తప్పకుండ గొల్చుచున్నాను. ఓ అశ్వనీదేవతలారా తమకు నేను మహాసంతోషముగా మ్రొ

కుచున్నాను. సకలలోకములయందు వెలసియుండు ఓకవీశ్వరులారా మిమ్ము నేను స్తోత్రములు జేయుచున్నాను. ఓసరస్వతీదేవీ నిన్ను అనేకవిధముల ప్రస్తుతిజేయుచుంటిని. శబ్దశాస్త్రములును ఛందస్సును చదువుకొనలేదు. నిన్ను నమ్మియున్న నన్ను రక్షింపభారము నీదేసుమా నామనవి చిత్తగింపుమమ్మా ఓసరస్వతీదేవీ నాకు వేగమే శబ్దములు దయచేయగదమ్మ.

సీ. శ్రీయాంజనేయ మీచరణముల్ నమ్మితి సరగున రావయ్య శరణుశరణు
ఏవేళ నీపూజ నెడబాయకున్నాను సరసనేయుండుము శరణుశరణు
శతయోజనముగల్గు శరనిధిదాటిన శంకరాంశోద్భవ శరణుశరణు
వజ్రశరీరనిన్ వదలకకొల్తు విచారముల్ దీర్పుము శరణుశరణు

గీ. ఎన్నవశమె నీమహిమంబు లెవరికైన, పరమపావనవేగనా పాపములను
పారదోలుము రక్షింపు పవనతనయ, ఆదరింపుము నాతండ్రి యాంజనేయ

తా. శోభనయుక్తుఁడవగు హనుమంతుడా నీపాదపద్మములు నమ్మియున్నాను. వేగముగా రావయ్యా నీకు శరణు జేయుచున్నాను. ఎల్లప్పుడు నన్నెడబాయకుండ నుండవలయును. నూరుయోజనములదూరము గలుగునట్టి సముద్రముదాటిన నీవు ఈశ్వరాంశానంభూతుడవు గనుక తమకు శరణు జేయుచున్నాను. వజ్రదేహముగలవాడవై వెలయు నిన్ను విడువకుండ పూజజేయుచున్నాను. చింతలడగింప వలయునని నీకు శరణుజేయుచున్నాను. మీయొక్కప్రభావము ఎవరును కనుగొనలేరు పావనమూర్తివి నాపాపముల బారదోలవలసినది ఓపావనమూర్తి వాయుకుమారుడా నన్ను రక్షించవలసినది నన్ను దయచూడవలసినది ఓఆంజనేయ.

## 2. వంశానుక్రమణిక.

సీ. శ్రీలక్ష్మీపురముతో చెలగుచు సమముగా రాణింపుచును సూర్య రావుపురము
బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రులుచాల పాడిపంటలచేత భాసురముగ
నాపురంబుననున్న యమరంగనోర్భాగ బావాజిమల్కాజీ భ్రాజితముగ
బహుకాలమునకును బావాజికొమరుడై యుదయించెనొక్కడీయూర్విలోన
గీ. పేదగొల్లయనుచును పేరుపెట్టి, పిలిచి రాతలిదండ్రులు ప్రియముగాను
సరసముగ బెంచినారయ్య చక్కగాను, ప్రజలుసంతోషమందగా బ్రబలమయ్యె

తా. శ్రీమహాలక్ష్మీపురముతో చెలగుచు సమముగా ప్రకాశించు చున్నటువంటి సూర్యరాయ పాలెములోను బ్రాహ్మణులును రాజులును కోమట్లును శూద్రులును చాల పాడి పంటలునుకలిగి ప్రకాశించుచుండును. ఈసూర్యరాయపురములో కాపురమున్నటువంటి దూదేకుల బావాజీసాహెబు మల్కా-జీసాహెబు యిద్దరు అన్నదమ్ములు ఒప్పుచున్నారు. కొంతకాలమునకు బావాజీసాహెబున కొకకుమారుడు పుట్టినాడు. బిడ్డలు బ్రతుకనందున గొల్లవాని పేరుపెట్టినారు. గొల్లడని పిలుచుచుండ వారును తలిదండ్రులును సమస్తమైనవారును సంతోషము పొందగాను ప్రఖ్యాతిగలవాడయినాడు.

సీ. గొల్లనామంబని కొద్దిసేయగరాదు సోమతేజము మోము సొగసువాడు
సారసదళముల సరియైన నేత్రముల్ క్రముకభూజముబోలు గళమువాడు
ఇంద్రచాపముబోలు నింపైనకన్బొమల్ పొడవైనబాహులిం పొందువాడు
సవరైనవక్షము చక్కనిదేహమ్ము పసమించుపాదముల్ బరగువాడు
గీ. విష్ణుడీరూపుజేసెను వీనికెపుడు, దానధర్మములందును దాతకర్ణు
డవ్వయప్పలపాదంబు లతిముదమున, పూజచేయుచున్నాడు పుణ్యుడితడు

తా॥ గొల్లవానిపేరని కొద్దిసేయవలదు. చంద్రునితో సమానమయినవాడు. తామరరేకులవంటి నేత్రములు కలవాఁడు. పోకవృక్షముతో సమానమైన కంఠముగలవాడు. ఇంద్రుని వింటిబద్దతో సమానమైన కనుబొమ్మలుకలవాఁడు. పొడవైనచేతులవాడు. నున్నపైనటువంటి రొమ్ముగలవాడు. కాంతిగలిగినటువంటి పాదములుగలవాఁడు. విష్ణుమూర్తి వనిరిం. ఈరూపమును కలుగజేసినవాడు ధర్మమున కర్ణుఁడు అనిపించుకొన్నవాడు. తల్లిదండ్రిల పాదపూజచేసిన పుణ్యాత్ముడు.

సీ. పుణ్యాత్మగొల్లకు పుత్రులిద్దరమును పొడమితిమయ్య యీపుడమిలోన
ప్రేమతో బైరాగి పేరును బెట్టియు పోషించినారు సుభోగములను
చదువుశాస్త్రములును చదివెను నాయన్న యేమిచదువును నేనెరుగలేదు
పరగనొక్కటహరివచ్చియు నను జూచి వైద్యయోగము చెప్పె వైనముగను
గీ. తెనుగుగా జేయుమవి చెప్పె తేజముగను, జెప్పుమనగను జెప్పితి చెలఁగ జగతి
చిన్నబైరాగిచెప్పిన సీసములకు, తప్పులను దిద్దువారలే దలియుదండ్రి.

తా॥ పుణ్యాత్ముఁడయిన గొల్లకు కుమాళ్ళు యిద్దరము ఓపుణ్యాత్ములార పుట్టినాము. ఈభూమియందు బిడ్డలు బ్రతుకనందున మాయిద్దరికిని పెదబయిరాగి చినబయిరాగియని పేర్లుంచి మహాభోగముగా పెంచినారు. చదువుశాస్త్రములు మా అన్నగారు చదువుకొన్నవాడు. నేను చదువుకొనలేదు. ఒకనాటిరోజున శ్రీమహావిష్ణువు నన్నుజూచి వైద్యయోగమును చెప్పినాడు. వయినముగా జెప్పుమనిరి గనుక చెప్పినాను. చినబయిరాగిచెప్పిన సీసపద్యాలకు వీటిలోతప్పులు దిద్దినటువంటివారు తల్లిదండ్రిలు.

## ౩. అంతర్గతవిషయములు.

సీ. మాతాతతండ్రి మాజననము మీకు జనులార జెప్పితి జగములోన
ఆయిదుప్రాణంబులు నష్టధాతువులును నవనిలో వ్యాధులా యజుడు చేసె
వైకుంఠవాసుడు వైద్యుడై జన్మించె రుద్రుడౌషధమాట రూఢిగాను
ముగ్గురుమూర్తులు మూలమై దేహాన నాదుకయుండిరి యఖిలమునకు
గీ. ఇన్ని గల్పించినారయ్య యిలనుమీద, వారిమహిమెన్న యెవరికివశముకాదు
గానరాకుండనున్నారు కలియుగమున, బుద్ధిచేతను చూడుడీ బుధులుమీరు.

తా. మాతాతగారి జన్మమును మాతండ్రిగారిజన్మమును మాజన్మమును ఓమానవులారా తమతో చెప్పుకొని యుంటిని. ఈభూమియందు అయిదు ప్రాణాలును ఎనిమిది ధాతువులును ఈభూమియం దున్నరోగాదులు బ్రహ్మదేవుడు చేసినాడు. శ్రీమన్నారాయణుండు వైద్యుడై జన్మించినాడు. ఈశ్వరుడు ఔషధమైనాడు ముగ్గురుమూర్తులును మూలమునై అఖిలప్రాణములకు ఆధారమైయున్నారు. ఇన్ని కల్పనచేసి యున్నారు. ఈభూమియందు వారిమహిమలు ఎన్నుటకు ఎవరికివశము కాదు. ఎవరికిని కనుపించకుండనున్నారు. ఈకలియుగమున పెద్దలకు బోధపడును. తెలియనివారికి తెలియదు.

సీ. వసుధభిషజులు ధన్వంతరివిజయము వినరయ్యమీరును విన్నపమును
నాలుగాశ్వాసము లోలిమైజెప్పెద ముందుమావంశము ముదముమీర
అష్టధాతువులును నఖిలరోగాదులు మరిద్వితీయాశ్వాసమందు సరగ
శుద్ధులు భస్మముల్ సూటిమార్గమ్ములు మూడవదానిలో ముఖ్యముగను
గీ. అన్నిరసములుగూర్చుక యౌషధములు, నాలుగవదాని నుందునుసతులుమీకు
ఆదరించుడి యీకథ నధిపులార, విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. ఈభూమియందున్నటువంటి వైద్యులయినవారు ఈధన్వంతరివిజయమను గ్రంథము వినరయ్యా మనవిజేయుచున్నాను. నాలుగుఆశ్వాసముల గ్రంథము జెప్పుచున్నాను. ముందుగా మావంశ మొకయాశ్వాసము ఎనిమిదిధాతువులును సమస్తమయినటువంటి రోగములును రెండవయాశ్వాసములో చెప్పియున్నాను. శుద్ధులును భస్మములును యింకను కొన్నిమార్గములును మూడవయాశ్వాసమునఁ జెప్పుచున్నాను. సమస్తమైన రసాలును గూర్చుకొని ఔషధములుచేయు ప్రకారములు నాలుగవయాశ్వాసములో జెప్పుచున్నాను. ఓవైద్యులారా శరణు జేయుచున్న నాకథయంతయు మీకు అనుకూలించవలయును. అన విష్ణుమూర్తి బైరాగితో బలికినాడు.

ఇది బైరాగిచేసిన ధన్వంతరివిజయమునఁ బ్రథమాశ్వాసము.

---

## ద్వి తీ యా శ్వా స ము.

---

### 4. నాడీవివరము.

సీ. అవనిలోవైద్యులా నందరువినరయ్య విన్నపమొక్కటి వీనులలర
అష్టనాళ్లనుమీర లమరంగవీక్షించి యానతిసేయుడీ యాత్మమునను
సాధ్యమసాధ్యమా సంకటమునురోసి యౌషధంబిచ్చిన హరియుమెచ్చు
శాస్త్రయుక్తముగాను సల్పనివైద్యుడు యమలోకవాసియైయుండుదురు
గీ. నాదుమాటలునిజముగా నమ్ముడయ్య, తప్పుగలిగినవారిని దండధరుడు
శిక్షజేయుచునున్నాడు శీఘ్రముగను, విష్ణుబైరాగితోబల్కె విశదముగను

సీ. ధర్మాత్ములైనట్టి ధన్వంతరులకెల్ల మనవిజేసెదను సామాన్యులార
వాతంబునకురక్త వనజాసనుండును పీతాంబరుడురక్తపిత్తమునకు
సరగశ్లేష్మమునకు శంభుండురక్తయు ముగ్గురుమూర్తులు ముదముమీర
నెనుబదినాలుగా నెన్నికలతులు ప్రాణులకల్పించె ప్రాజ్ఞులలర
గీ. తెరలలోపలగూడుక తెలియకుండ, ప్రీతిమలాడింపుచున్నాడుప్రాణికోట్ల
తత్వవైద్యులకిదియును తథ్యమనుచు, విష్ణువైరాగితోదెల్పె విశదముగను

## 5. వాతధాతుపరీక్ష.

సీ. వినరయ్యవైద్యులు విన్నపమొక్కటి వాతధాతువుయొక్క వరుసమీరు
ప్రథమాంగుళముక్రింద పరికించిచూడుడీ యేకచిత్తంబున నెంచిమీరు
పుట్టలలోబ్రాకు భుజగంబుపగిదిని తాంబేలులాగున తారుచుండు
జలములలోనుండు జలచరంబనుజల్గ నాలుగురీతుల నడచునెపుడు
గీ. తెలివిగాజూచువారికి తేటపడును, శాస్త్రమెరుగని వైద్యము సల్పరాదు
మూఢవైద్యులకెప్పుడు ముక్తిలేదు, విష్ణువైరాగితోజెప్పె విశదముగను.

తా. వినరయ్యా వైద్యులారా మనవి నాధాతువు యొక్క ప్రకారము మొదటి వ్రేలిక్రిందను పరీక్షజేసి యేక చిత్తము అనగా స్వస్థచిత్తమున జూచునది. పుట్టలలోబ్రాకు సర్పమువలెనగునవి తాంబేలునకువలెనగునవి తారుచుండును నీళ్లలో తిరుగుచుండునటువంటి జలగవలెను ఈచెప్పిన నాలుగు విధాల నడతల నడుచుచుండును. గ్రహించుకొనగలవారికి కనుపించియుండును శాస్త్రము చదువుకొనినవారు వైద్యముసేయరాదు మూఢవైద్యులకు బరలోకము లేదని విష్ణువైరాగితో సెలవిచ్చెను.

## 6. పైత్యధాతుపరీక్ష.

సీ. ప్రియముగావినరయ్య పిత్తధాతువిధము పెద్దవ్రేలికి క్రింద పెనగుచుండు
మండూకములవలె మరిమరివచ్చుచు క్రిమికంబులుగూయు శీఘ్రముగను
పురువకాకము నెప్పు పురమున నెగయుచు లావుకపక్షియు లఘుతనుండు
ఘనులైనవైద్యులీగతులు గ్రహించి యౌషధమీయనాయువు చాలపెరుగు
గీ. జనులతత్వంబు దెనియక సల్పవైద్య, మాయమునికడదూతయు నతడెయితడు
నరకమునబడుదురు వీరలరయతుదను, విష్ణు బైరాగితో జెప్పె విశదముగను.

తా. సంతోషముగా వినరయ్యా పైత్యధాతువుయొక్క ప్రకారము మధ్యవ్రేలి క్రిందను పెనిగా నడచుచుండును. కప్ప వలె నెగసి యెగసి నడచుచుండును. ఆడుకోవెలవలె కూయు చున్నట్లు నడచుచుండును, పోతుకాకి పురము వేసినట్లుగా నడు చుచుండును. లకుముకిపక్షివలె నడుచుచుండును. ఘనులైన వైద్యులు యీప్రకారము నూహజేసి ఔషధమిచ్చిన పక్షముకు ఆయుర్వృద్ధి యగును. మనుష్యుల తత్వము తెలియకుండ జేసిన వైద్యులు యమధర్మరాజు దగ్గరనుండెడు దూతలెటువంటి వారో అటువంటివారే. నరకములో నీమూర్ఖవైద్యులు పడి పోవుదురని విష్ణుమూర్తి బైరాగితో చెప్పినాడు.

## 7. శ్లేష్మధాతుపరీక్ష.

సీ. శ్లేష్మధాతువుయొక్క చేష్టలు జెప్పెద చిన్నవ్రేలికిక్రిందఁ జెలఁగుచుండు
గహనభూములనుండు గజగమనమ్మున నుండునంచగతిని నుండునంద
ముగను శైలతలాగ్రముపయిని బురివిప్పి యాడుచున్న శిఖిచయంబుబోలు
కొక్కొరకోయని కోళ్ళునగ్రక్కున గూయుచునున్నయా గురుతునదగు

గీ. వాతకఫపైత్యవర్గంబు వరుసగాను, హస్తమునునాభిచరణము లాననమును
దేహమలమూత్రనేత్రముల్ తెలియుమనుచు, విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను

తా. శ్లేష్మధాతువు నడచుప్రకారము కడ్రవేలి క్రిందను నడచును. అరణ్యభూములయందున్నటువంటి యేనుగువలె నడుచుచుండును. హంసవలె అందముగా నడచును. పర్వతాగ్రమందు పురివిప్పి యాడుచున్నటువంటి నెమళ్ళు నాట్యము చేయుచున్న ప్రకారము నడచుచుండును. వాతమును, పైత్యమును, శ్లేష్మమును, హస్తమును, నాభియు పాదములును, ముఖమందును, శరీరమును, విరేచనమును, అల్పాచమానమును, కనులయందును, ఈవాతపైత్యశ్లేష్మములును, ఈ చెప్పిన యెనిమిదింటను నడుచుచుండును. మీరు నిదానము చేసికోవలసినదని విష్ణు బైరాగితో విశదపరచినాడు.

## 8. ధాతుపరీక్షా నిషేధసమయములు.

సీ. సాపాటుచేసియు స్నానంబుచేసిన గమలజాక్షులతోడఁ గలసియున్న
గల్లునుద్రాగిన గంజాయి దిన్నను కోళ్ళగుండియలను గుడిచియున్న
ఉరగమాంసముదిన్ననుపవాసమున్నను మండూకమాంసంబుమరియుఁదిన్న
ఎండనుదిరిగిన నేడ్చినవనలసిన భూతంబుసోకిన భువినిజనులు

గీ. ధాతువులువీరికెప్పుడు దబ్బరముగ, నాడుచున్నవి యిదియేమియనుచుమీరు
దేహమీరీతిదనియెప్డు తెలియుమనుచు, విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. భోజనముచేసిన, స్నానంబుచేసిన స్త్రీలతో సంగమముజేసి యలసిన, కల్లుద్రావిన, గంజాయిదిన్న, కోడిగుండెలుదిన్న, పాములదిన్న, ఉపవాసమున్న, కప్పమాంసముదిన్న,

ఎండనుతిరిగి యలసిన, ఏడ్చిన, దయ్యముపట్టినవానికి ఈ చెప్పిన నడతలను నడచినవారికి ధాతువులు దబ్బరలుగా నాడుచున్నవి. ఈలాగుననున్నవని సంశయపడక వీరిశరీరము ప్రకృతి యిట్టిదని యనుకోవలసిన దని విష్ణుమూర్తి బయిరాగితోఁ బలికెను.

## 9. లంఖననిషేధము.

సీ. కాంతసుగర్భిణి కనుపించునప్పుడు నతిసారమునుబుట్టి యలయునాడు
నేత్రరోగములచే నేడ్చుచున్నప్పుడు ముదిమిగ్రద్దియుచాల మూల్గునపుడు
వీర్యంబునష్టమై విరిగిపోయినయప్డు గ్రహణిబుట్టినయప్డు గ్రక్కునపుడు
క్షయపాండువులచేత శ్రమపడునప్పుడు నుబ్బసంబున నెగయూపిరియగు
గీ. నిట్టివేళను ధాతువు లింపుగాగ, నుండవనియాత్మనెరుగుచు నుండిమరియు
లంఖనమువీరినుంచుట లాఘవమ్ము, విష్ణు బైరాగితోబల్కె విశదముగను.

తా. స్త్రీలు గర్భిణులై యున్నప్పుడును, అతిసారము పుట్టినప్పుడును, అలసినప్పుడును, నేత్రరోగములచే నేడ్చుచున్నప్పుడును, ముసలివాడై మూల్గుచున్నప్పుడును, వీర్యము విరిగి పడిపోయినప్పుడును, విరేచనములు పుట్టునప్పుడును, వాంతులు వెళ్లుచున్నప్పుడును, క్షయలు పాండురోగములప్పుడును, బాధకాలమప్పుడును, ఇటువంటివేళల ధాతువులు యుక్తంబుగా నుండవని మనమున నెఱిగియుండి యీరోగులను లంఖనము లుంచకూడదు. ఉంచినపక్షమున రోగులకు వైద్యులకు ఆయాసమని విష్ణు బైరాగితో విశదముగా బలికినాడు.

## 10. ఔషధగర్హ్యాణము.

సీ. నేత్రముల్ నీరున నెడలకయున్నను నేత్రముల్ నీరును నెడలుచున్న
గళమున శ్లేష్మము గట్టిగానున్నను నాసిక సన్నసైననునణగిన
కన్నులకెవ్వరు కనుపడకున్నను కనుకొలుకులనల్పు గానబడిన
నుమ్మివేయగబోవ నుదరముపైబడ్డ కాళ్ళుతీపులుచాల గల్గియున్న
గీ. వినగబడకుండ మందమై వీనులున్న | వైద్యులైనట్టివారలు వయినముగను
నిట్టిగుణములకౌషధ మిడగవలదు | విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. కనులలో నీళ్ళు లేక పోయినను, నీళ్ళు మిక్కిలి వెళ్ళుచున్నను, కంఠమందు శ్లేష్మము కదలకయున్నను, కళ్ళ కొలుకులు నలుపుగా కన్పించినను, ఉమ్మివేయఁబోయిన రొమ్ము మీదపడినను, కాళ్ళు చాలా తీపులుగానున్నను, చెవులు వినరాకయున్నను, ఇటువంటి గుణములు కనుపించినపక్షముకు ఔషధమియ్యవలదని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బలికినాఁడు.

## 11. పదమూఁడుసన్నిపాతములు, ప్రవేశించువేళలు.

సీ. ఆకలిలేమియు నావలింతతరుచు నరుచిజిహ్వాయరుచి యగుచునున్న
బరువుగామాటలు బలుకుచునున్నను కన్నులమంటలు కలిగియున్న
బరువగుమేనును బాధయుతలనొప్పి చలికినోర్వక తలగుచున్న
కన్నులుమూసియు కలవరింపుచునున్న దేహతాపముచేత దరలుచున్న
గీ. గుణములన్నియు జూచియు గుర్తెరింగి | నిజముజరధాతువనియిదినిశ్చయముగ
నవనినెన్నికజేసిన యశముననుచు | విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

## 12. సన్నిపాతప్రవర్తకములు.

సీ. సన్నిపాతమువచ్చు సమయముల్ జెప్పెద బూరెలరిసెగారె బుచ్చుకొన్న
చన్నీళ్ళస్నానము చక్కగాజేయుచు చెలులసంగమము జేయుచున్న
భాండదూరమువాడు పచ్చిపిండిభుజియించిన్న బిడ్డగన్నయప్డు భీతిపడిన
అతిదుఃఖములచేత నలసటనిద్రింప పరుగెత్తి పెద్దగా బల్కుచున్న
గీ. అట్టితరిజూచి సంధుల ననుసరించి|వీనిలోనారు సాధ్యముల్ విశదముగను
నలవికాకుండ నెవరికి నారునొకటి | విష్ణుబైరాగితో జెప్పె వివరముగను.

తా. బూరెలు అరిసెలు గారెలు ఇవిపుచ్చుకొన్నప్పుడు చన్నీళ్ళస్నానముచేసినప్పుడు స్త్రీలతో సురతముచేసినప్పుడును ముట్టయినరోజున పచ్చిపిండితిన్నప్పుడును బిడ్డగలిగినప్పుడును, భయపడినప్పుడును మిక్కిలి యేడ్చినప్పుడును అలసటపడి నిద్రపోయినప్పుడును పరుగెత్తినప్పుడును పెద్దమాటలు ఆడినప్పుడును అట్టి సమయములుజూచి సంధులు అనుసరించును. వీనిలో ఆరుసన్నిపాతంబులు సాధ్యములు. ఏడుసన్నిపాతంబు లెవరికి సాధ్యముకావు.

## 13. సాధ్యసంధులు.

సీ. చెలగుచుండాడుచు చిరునవ్వునవ్వును చిత్తవిభ్రమసంధి శీఘ్రముగప్రి
లాపములుబల్కు ప్రలాపసన్నియు మరిసంధికసన్నియు సరసముగను
తంద్రిగుణముగల తాంద్రికసన్నియు జిహ్వాకసన్నియు చింతజేయ
ఘన గుణములుగల కర్ణకసన్నియు ఆరునుసాధ్యము లవనిలోన
గీ. నిర్ణయముచేసి రౌషధ వర్ణమపుడు | హరిహరాదులకృపచేత నవనియందు
బ్రతుకుచుండెడిని వియారుప్రబలముగను|విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. చిత్తవిభ్రమసన్నిపాతము చిత్రముగా సంగీతము పాడుచు నవ్వుచుండును. ప్రలాపసన్నిపాతము ప్రళయములు బల్కును. సంధికసన్నిపాతము నరసత్వముగలది. తాంద్రికసన్నిపాతము తందరిగుణములు కలది. జిహ్వాకసన్నిపాతము చింత జేయును. కర్ణికసన్నిపాతము ఘనాధిక్యమైనటువంటి గుణములుకలది. ఈఆరు సన్నిపాతములు సాధ్యమని ఔషధము ఇచ్చినపక్షముకు ఈశ్వరుడును, విష్ణువును వీరియనుగ్రహము చేతను బ్రితుకుచుండును, అని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా చెప్పినాడు.

### 14. సాధ్యసంధిదృష్టాంతములు.

సీ. చిత్తవిభ్రిమసన్ని చిన్నెలు వినరయ్య సంగీతములుపాడు చక్కగాను
దిక్కులుచూచుచు దిగులుపడుచుండు కన్నులుమూసియు గదలకుండు
ప్రిక్కనొప్పులటంచు పలుమారుచెలుపుచువడిగనేడ్చుచునుండువణుకుచుండు
నిట్టట్టుచూచుచు నీల్గిలబడియుండు తత్తరపడుచుండు దగ్గుచుండు
గీ. కడుపునొప్పియునొకవేళ గానుపించు, నేకవింశతిదినముల కెంచిచూడ
హరియనుగ్రహచేత తేలించునవనియందు, విష్ణుబైరాగితో జెప్పెవిశదముగను

తా. చిత్తవిభ్రిమ సన్నిపాతాన కుండేగుణములు సంగీతములు పాడును, దిక్కులుచూచును, దిగులు పడుచుండును కన్నులు మూయుచుండును, కదలకుండనుండును, ప్రిక్కలు నొప్పియని పలుమారు చెప్పుచు ఏడ్చుచు, వణకుచుండును, ఇటునటుచూచుచు చకెకిలబడుచు తత్తరపడుచు దగ్గుచుండును కడుపునొప్పిచేత బాధపడుచు ఇరువదియొక్క దినముల

నాటికి గూఢిగాను శ్రీమహావిష్ణు దయచేత బ్రతుకునని బై రాగితో విష్ణుమూర్తి విశదముగా బలికినాడు.

## 15. ప్రలాపసంధి.

సీ. రహి ప్రలాపకసన్ని ప్రఖ్యాతి వినరయ్య పిచ్చిమాటలుచాల ప్రేలుచుండు
ఒకవేళ వాతంబు ఒకవేళ పైత్యము శ్లేష్మంబుచల్లగా జేయుచుండు
కాయంబుమిక్కిలి కంపముఁ బొందుచు తలనొప్పిగలిగియు దగ్గుచుండు
తాపజ్వరముతోను తహతహపడుచుండు నపుడె దాహము నడుగుచుండు
పలుమారులేచుచు పరుగెత్తఁబోవుచు తరుచుమాటలుజెప్పు తప్పకుండ

గీ. మలమూత్రములు జరుగును మందముగను, బదియునాలుగుదినములబలమునణగి
హరియనుగ్రహచేతదేలించు నవ్వియందు, విష్ణుబైరాగితో జెప్పెవిశదముగను.

తా. ప్రలాపసన్నిపాత ప్రభావము వేలవపుమాటలు చాలపేలుచుండును. ఒకసమయమందు వాతమును ఒకసమయమందు పైత్యమును, ఒకసమయమందు శ్లేష్మమును చల్లగాజేయుచుండును. శరీరము మిక్కిలి కంపము నొందియుండును తలనొప్పికలిగియుండును. దగ్గుచుండును, తాపజ్వరమున అలసటపడుచుండును అప్పుడే దాహము పుచ్చుకొనుచుండును ఉండియుండి లేచుచుండును పరుగెత్తబోవుచుండును. మిక్కిలి మాటలు చెప్పుచుండును. మలమును మూత్రమును మందముగా జరుగుచుండును పదునాలుగు రోజులనాటికి యీరోగానికి బలము అణగును. మహావిష్ణుదయచేత జీవించును. అని బైరాగితో విష్ణుమూర్తి విశదముగా జెప్పినాడు.

## 16 సంధిక.

సీ. సంధికసన్నియు చక్కఁగావినరయ్య త్వరగత్వరగ లేచి దాహమడుగు
దగ్గులుఁగలుగుచు దబ్బరలాడుచు నాడందఱినిజూచి నవ్వుచుండు
పుక్కిళ్ళకొలదిగా పూరించు శ్లేష్మము అగ్గితాకినటుచు నడలుచుండు
కడుపుబ్బయునుచాలకడుపునొప్పియుఁగల్గియెగరోజుబుట్టియుంనేడ్చుచుండు
గీ. భ్రాంతిమూర్తియుబడలిక బాధపడును, సప్తదినములనాటికి సన్నిపాత
మచ్యుతునిదయజీవించు నవనియందు, విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. సంధికసన్నిపాతమునకుండు గుణాలుదవ్వుదవ్వున లేచి దాహము అడుగును దగ్గులు కలుగును దబ్బరలాడును అందరిని చూచినవ్వును. అబద్ధములాడును. నోటినిండ శ్లేష్మము వచ్చుచుండును. వేడిగానున్నదని యేడ్చుచుండును. కడుపుబ్బును. నొప్పియు నెగరోయును. కలిగియుండును. ఏడ్చుచుండును. అపేక్షకలిగియుండును. మూర్ఛకలిగియుండును. బడలిక కలిగియుండును. బాధపడుచుండును. ఏడురోజుల నాటికి, కూడ జీవించునని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బల్కినాడు.

## 17. తాంద్రికము.

సీ. తాంద్రికసన్నియు తప్పకవినరయ్య తంద్రిపుగుణములు దగిలియుండు
పలుమారుబిలుచుచు బలుమాటలనుబల్కు నాలుక పెదవుల నమలుచుండు
బిరుసుననిండియు బిడకలాగుండును దేహవిదాహమై దెరలుచుండు
విరివిగాకన్నులు వికసించియుండును నిర్విణ్ణుడైకంట నీరుగారు
గీ. తీటలనుబుట్టిదేహము తిప్పుచుండు పంచవింశతికీసన్ని పరిహరించు
హరియుకృపచేతజీవించునవనియందు, విష్ణుబయిరాగితోఁబల్కెవిశదముగను

తా. తాంద్రికసన్నిపాతమునకు ఉండుగుణములు తంద్రిగుణాలు కలిగియుండును మరియుమరియు పిలుచుచుండును. కొంటెమాటలు ఆడుచుండును నాలుక చేపెదవులు నమలుచుండును నాలుకబిరుసుపడి పిడకలాగున నెండి చెమ్మలేక యుండును శరీరము వేదనచేత విదాహముగా నుండును నేత్రములు పెద్దవై మూతలుపడకుండ యుండును పడిచూచుచు మాటలు లేకుండ నుండును కనులవెంట నీరుగారుచుండును శరీరముదురదలుపుట్టి త్రిప్పుచుండును. ఇరువది అయిదవనాటికి యీసన్నిపాతము మానును. అని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బల్కినాడు.

## 18. జిహ్వాగము.

సీ. జిహ్వాగసన్నియు జిహ్వయెండుచునుండు మాటలురాకను మణగియుండు
నాలుకపగిలియు నల్లగానుండును ముల్లుగలిగిజిహ్వ మూసియుండు
నెగయూర్ధ్వమై చాలదిగులుపడుచునుండు తాపజ్వరముతోడ తారుచుండు
దాహంబునధికమై తహతహపడుచుండు జ్వరముతీవ్రముగాను జరుగుచుండు
గీ. నోకిలింతలు నెక్కుళ్ళునోగివచ్చు పదియునారుదినముల కుపరిహరించు
హరియుగృపచేత జీవించునవనియందు విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. జిహ్వాగ సన్నిపాతమునకుండు గుణాలు-జిహ్వ యెగురుచుండును. మాటరాకుండ నూరకేయుండును. నాలుక పగిలి నల్లబడి ముల్లుగలిగి జిహ్వ మూసికొనియుండును. ఎగయూపిరిచేతను అలసటపడుచుండును. తాపజ్వరముచేత తారులాడుచుండును. దాహము అధికముగా దాగుచుండును. జ్వర

ము తీవ్రముగానుండును. ఓకలింతలును, ఎక్కిళ్లును వచ్చుచుం డును. పదునారు రోజులనాటికి యీసన్నిపాతము పరిహరించు నని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బలికినాడు.

19. కర్ణికము.

సీ. కర్ణికసన్నియు ఘనులౌ గుణరయ్యు ప్రమరంపుగుణములు ప్రబలుచుండు
హిక్కడొక్కయుడోపు నెడలక యుండును కళ్ళనొప్పుచేత కలకపడును
రెండు వీనులక్రింద రెండుచిల్లులువేసి తీపుచేతనుతల త్రిప్పుచుండు
నిద్రబట్టక తాను నిలుకడదప్పియు శోభకాసలుశ్వాస సోలుచుండు
గీ. వాతపైత్యంబులెప్పుడు వదలకుండు, మూడుమాసంబులకుదాక మూల్గుచుండు
హరియుగ్రుపచేత జీవించునననియందు, విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. కర్ణిక సన్నిపాతములకుండుగుణాలు ప్రబలమై నటువంటిగుణాలుకల్పించును. ఇక కడుపులో ఆర్చుటయును కళ్ళుకలికి నొప్పిగానుండును. రెండుచెవులదగ్గిని రెండు బిళ్ళలు వేసి బాధచేతను శిరస్సు త్రిప్పుకొనుచుండును. నిద్రబట్టక నిజబుద్ధితప్పియుండును శోభలును కాసలును, శ్వాసలును, వాటిచేతను సుక్కుచుండును. వాతమును పైత్యమును ఈ రెండును వదలకుండును. మూడునెలలు దనుక కర్ణికసన్ని పాతము వదలకుండనుండును. అనివిష్ణుమూర్తి బైరాగితో విశ దముగా బలికినాడు.

20 అసాధ్యసంధులు.

సీ. చిత్తంబు చెదరంగ శిరంబు గుర్తింగించి శీతాంగముగను నేను శీఘ్రముగను
అంతకసన్నియు హరమని తెలియుడిరుద్ధాహసన్నియుయుత్తయగును
భగ్ననేత్రపుసన్ని భంగంబుగాపించు విభ్రష్టివెంచేయు రక్షణవిడిచి
కంఠకుబ్జకసన్ని గళముసుబిగబట్టి కదలకుండగ ప్రాణి కడపుచేర్చు

గీ. ఆపదలు జెంది యాభిన్యమంతమగును| హరిహరాదులకి విధియును నారునొకటి
సాధ్యములు గావు జలకసాధ్యమవును| విష్ణు బైరాగితో చెప్పె విశదము గను.

తా. మనస్సు చెదరిపోవులాగున దేహము శీతలమై శీతాంగ సన్నిపాతము వెడలిపోవును. అంతక సన్నిపాతము హతమని తెలియ వలసినది రుగ్దాహ సన్నిపాతము రుత్రి యగును భగ్ననేత్రి సన్నిపాతము భంగముచేసిపోవును. రక్తష్ఠి సన్నిపాతము వెళ్ళనదినిజము కంఠకుబ్జగ సన్నిపాతము గొంతుక గట్టిగాబట్టుకొని ప్రాణము దీసివేయును. అభిన్యాసన్నిపాతము మహా ఆపత్తును జెంది హతమై పోవును విష్ణుకును ఈశ్వరునకును ఈయేడు సన్నిపాతములుసాధ్యముకానివి అని విష్ణుమూర్తి బైరాగితో విశదము బలికినాడు.

## 21 శీతాంగము.

సీ. సీతాంగసన్నియు శీఘ్రింబ వినుడయ్య యతిపైత్యదేహమైయలరుచుండు
వాంతిగల్గుచునుండు వడిగ మూర్ఛిల్లియు వదలకుండగచాల వదలకుండు
వేసిన కాల్చేయ్యి వేసినట్లైయుండు నెక్కిళ్ళువచ్చును నెడపకుండ
కుతికలో శ్లేష్మము కుటిలమైయుండును దాహము నెగరోజు దగ్గుచుండు
గీ. నీనులకు మాటలేమియు వినగరావు| హరిహరాదుల కీసన్ని యలవికాదు
పక్షమగునాటికీరోగి ప్రాణివిడుచు| విష్ణు బైరాగితో చెప్పె విశదముగను.

తా. శీతాంగసన్నిపాతములకుండు గుణములు శరీరము శీతలమయి యుండును. వాంతివెళ్లుచుండును. మూర్ఛగలిగి యుండును. వణకుచుండును. కాళ్లుచేతులును ఏలాగువేసినవి ఆలాగేయుండును. ఎక్కిళ్లు వేగముగా వచ్చుచుండును. గొంతుకలో శ్లేష్మము కదలకుండ నుండును. దాహము గలిగియుండు

ను. ఎగరోజును దగ్గు గలిగియుండును. చెవులకు మాటలు విన రాకుండును. హరిహరాదులకు ఈసన్నిపాతము అలవికాదు. పదునేను రోజులనాటికి యీరోగి ప్రాణము చాలించును అని విష్ణుమూర్తి బయిరాగితో విశదముగాఁ బలికినాడు.

## 22 అంతకము.

సీ. అంతకసన్నియు నాశ్చర్యమువినుండి కాయంబునెప్పటికాంతినుండు
సందుసందులనొప్పి చాలగనుండును కాళ్ళతీపులువెట్టు ఘనముగాను
ఒడలుచీదరదోఁచు నోపికయుండదు తరుచుచాంచల్యము దగులుచుండు
తంద్రిగలుగుచుండు తాపంబువచ్చియు మలముబంధించియు మందముగను
గీ. కనులుపుసిగట్టి నీరొగిగారుచుండు, హరిహరాదులకీసంధి యలవికాదు
పదిదినమ్ముల కీసంధి ప్రాణివిడుచు, విష్ణుబయిరాగితోఁజెప్పెవిశదముగను.

తా. అంతక సన్నిపాతమునకుండు గుణములు—ఎప్పటి వలెనే కాంతిగలిగియుండును. కీళ్ళనందున చాల నొచ్చుచుండును. కాళ్ళు మిక్కిలిగా తీపెత్తుచుండును. ఒడలు చీదరలై ఓపికలేక మనస్సు చంచలమగుచుండును. తంద్రి గలిగియుండును. తాపము గలిగియుండును. మలబద్ధముచేసి మందముగా నుండును. నేత్రములు పుసిగట్టి నీరుగారుచుండును. హరిహరాదుల కీసన్నిపాతము అసాధ్యము. పదిరోజులనాటికి యీరోగి ప్రాణము చాలించును. అని విష్ణు బయిరాగితోఁ బలికెను.

## 23 రుద్గాహకము.

సీ. రుద్గాహసన్నియు గూఢిగానివరయ్యు దాహంబుబుట్టియుం దగ్గముండు
మతిభ్రమమోహించు మరిమరియేఁచ్చను కత్తుకెండెనుచు కఫములుచుండు

ఎక్కిళ్ళచేతను బొక్కుచునుండును ప్రేలాపమాటలు ప్రేలుచుండు
మలముమూత్రము రెండుమలినముగజరుగునొసటరొమ్మునచెమ్మ మసలుచుండు
గీ. జామునకొకరీతిగానుండు జాడ్యములను, హరిహరాదులకీసంధి యలవికాదు
వింశతిదినంబులవరోగి విడుచుప్రాణి, విష్ణుబైరాగితోఁజెప్పె విశదముగను.

తా. రుద్రాహ సన్నిపాతమునకుండు గుణములు దగ్గును దాహమును గలిగియుండును. మతిభ్రమచేతను మోహించి మరిమరి యేడ్చుచు కంఠము ఇగురుచున్నదని దుఃఖపడుచుండును. ఎక్కిళ్ళు విస్తారముచేతను బాధపడుచుండును. ప్రేలాపములు ప్రేలుచుండును. మలము మూత్రము మందముగా జరుగుచుండును నొసటను రొమ్మునను చెమట యోడుచుండును. జామునకు ఒక్కొక్క రీతిగా సంకటముండును. హరిహరాదులకీసన్నిపాతము అసాధ్యమని యిరవయిరోజులనాటికి యీరోగి ప్రాణములు చాలించునని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా పలికినాడు.

## 24. భగ్ననేత్రకము.

సీ. భగ్ననేత్రపుసంధి బాగుగాఁనరయ్య కళ్లువాచియుచూపు గానకుండు
నేత్రముల్ నీరును నెరగ్రమ్ముచుండును పెక్కుమాటలుచాల ప్రేలుచుండు
కంపరమొందుచు కలవరింపుచునుండు కన్నులుమూసిగూం కలతపడును
అక్రమవాక్యములాడుచునుండును మూత్రముపిడుచుచు మూల్గుచుండు
గీ. అంతకంతకుజాడ్యము నధికమగును, హరిహరాదులకీసన్ని యలవికాదు
ఏడుదినములకీరోగి యొడలుప్రాణి, విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. భగ్ననేత్రపు సన్నిపాతమునకుండు గుణములు, నేత్రములు వాచిచూపు కనుపించకుండ నుండును. కనుల నీరు

కారుచుండును. శరీరము కంపరమును కలవరింతలును కలిగి యుండును. నేత్రములు మూసి కలతపడును. అక్రమపుమాటలు ఆడుచుండును. అల్పాచమానము చేయుచు మూలుగు చుండును. రోజునకు రోజు సంకటము అధికముగా అవును హరిహరాదులకు ఈసన్నిపాతము అసాధ్యమని యేడురోజులకు యీరోగి ప్రాణము చాలించునని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బలికియున్నాడు.

## 25 రక్తక్షేపకము.

సీ. రక్తక్షేపసన్ని రాణించువినుఁడయ్య మూర్ఛచేవడిగను మూల్గుచుండు
తరుచుగారక్తము తలవాకిటగపడు నాసికవెంటను నడచుచుండు
భ్రమమాటలునుకొన్ని బ్రిబలతబల్కను ఎక్కిళ్లువాంతియు నెడలుచుండు
తీవ్రపుజ్వరమును త్రిప్పనుతిక్కయు వెసనునోరిగురును విస్తరించు
గీ. నిన్నిగుణములుచీనిని విమఁకుండు, హరిహరాదులకీసన్ని యలవికాదు
పదిదినమ్ములకీరోగి ప్రాణివిడుచు, విష్ణుబైరాగితోబల్కె విశదముగను.

తా. రక్తక్షేపి సన్నిపాతమునకుండు గుణములు మూర్ఛపోవుచుండును. మూలుగుచుండును. విస్తారముగా నోటివెంబడి ముక్కువెంటను రక్తము వెళ్లుచుండును. అబద్ధములాడుచుండును. ఎక్కిళ్లును వాంతులును వెళ్లుచుండును. త్వరితమయిన ఉష్ణమును తిప్పను, తిక్కనునోరిగురును విస్తారముగానుండును. హరిహరాదుల కీసన్నిపాతము అలవికాదనియు, పదిరోజుల నాటికి యీరోగి ప్రాణము వదలునని విష్ణు బైరాగితో బలికె.

## 26 కంఠకుబ్జము.

సీ. కంఠకుబ్జముసన్ని గతివిూరువినరయ్య మెడయొకదియఁబడు మెదలకుండ
కడుపులోగుండిగ్రించు కంపరమొందుచు వడిగవడిగవాంతి వచ్చుచుండు
వేగముగాచాల వెడలునెక్కిళ్ళును తలనొప్పిచేతను తరుచునేడ్చు
కనులనీళ్ళునుగారు కాయంబుతీపునై మూర్ఛచేమెదలక మణిగియుండు
గీ. దాహమడుగుచునుండును దగ్గుచుండు, హరిహరాదులకీసన్ని యలవికాదు
పరగపదుమూడురోజుల ప్రాణివిడుచు। విష్ణుబైరాగితోదెల్పె విశదముగను

తా. కంఠకుబ్జసన్నిపాతమున కుండుగుణములు. మెడ కుదియబడి మెదలకుండ నుండును. గర్భములో గుండ్రించుచేత ను శరీరము గగుర్పొడుచుచుండును. తరుచుగా వాంతిపెళ్ళు చుండును. ఎగరోజును మిక్కిలి ఎక్కిళ్లు వచ్చును. శిరస్సు నొప్పిచేతను రోదనము చేయుచుండును. నేత్రములవెంట నీళ్లు కారుచుండును. శరీరము తీపుతీయుచుండును. మూర్ఛపడి మెదలకుండ నుండును. విస్తారము దాహము పుచ్చుకొనుచుం డును. దగ్గుగలిగియుండును. ఈసన్నిపాతము హరిహరాదులకు అలవికాదని పదుమూడురోజులనాటికి ప్రాణము తీసివేయునని విష్ణు బైరాగితో విశదముగా బల్కినాఁడు.

## 27. అభిన్నకము.

సీ. అభిన్నసన్నిదా నాగతివినరయ్య తాపంబుతంద్రియుఁ దగిలియుండు
నిస్సత్వదేహమై నిద్రిపోవుచునుండు మందంబుబుట్టియు మణిగియుండు
అతికష్టపడుచుండు నతిరోజుచుండును దృష్టాతిశయమునఁ దేలుచుండు
దోషజ్వరముతోడ దోరుచునుండును దేహంబునొప్పిచేఁ దెరలుచుండు
గీ. శ్వాసగలుగుచునుండు నిశ్వాసములును, హరిహరాదులకీసన్ని యలవికాదు
పక్షమగునాటి రోగి ప్రాణివిడుచు, విష్ణుబైరాగితోబల్కె విశదముగను.

తా. అభిన్నక సన్నిపాతమునకుండు లక్షణములు తంద్ర కలిగియుండును. దేహము నిస్సత్తువై నిద్రయధికముగా నుండును. మందముగామాటలాడుచుండును. మిక్కిలి మెగఁగోజుచే తను కష్టపడుచుండును. ఆకలి అతిశయముచేతను తూలుచుండును. దోషజ్వరముచేత దొరలుచుండును. శరీరము నొప్పిచేయుచుండును. శ్వాసలును, నిశ్వాసలును, వచ్చుచుండును. హరిహరాదులకీ సన్నిపాతము అలవికాదని పదునేనురోజుల నాటికి యీరోగి ప్రాణము చాలించునని విష్ణుమూర్తి బయిరాగితో విశదముగాఁ బలికినాఁడు.

వ. ఈ యేడు సన్నిపాతములు అసాధ్యములని వైద్యులెఱుంగునది.

## 28. వాతజ్వరనిదానము.

సీ. వాతజ్వరంబును వరుసగావినరయ్య నల్లగాముఖమును నలుపుచుండు
తిమ్మిరిగల్గియుం తీటతాకుచునుండు దాహ మధికముగ త్రాగుచుండు
సన్నపుచెమటలు సర్వాంగమునయందు పెదవులుగెండియు పేలుచుండు
మలముబంధించియు మందమైయుండును చక్కగా జ్వరమునుజరగుచుండు
గీ. మలము నల్లగఁబడుచుండుమందముగను, విడుచుమూత్రము తెల్లగావి స్తరించు
మాటలుపములైయుండుమంచిగాను, విష్ణుబయిరాగితోఁబల్కెవిశదముగను.

తా. తాపజ్వరమునకుండు గుణములు - ముఖమునల్లబాఱియుండును. తిమ్మిరిబారియుండును. తీటగలిగియుండును. దాహము విస్తారముగా పుచ్చుకొనుచుండును. సన్నపు చెమట దేహమంత కలిగియుండును. పెదవులు ఆరి పగిలియుండును. విరేచనము బంధించి మందగతిగా నుండును. జ్వరముగలిగియుం

డును. విరేచనము నల్లగా వెళ్ళుచుండును. అల్పాచమూనము తెల్లగాపడుచుండును. మాటలు మంచిగానే మాట్లాడును. అని విష్ణుమూర్తి బయిరాగితో విశదముగా బలికినాడు.

## 29. పిత్తజ్వరలక్షణము.

సీ. పిత్తజ్వరగుణము ప్రియముగా వినరయ్య అతిసారమును నిద్రియలసటయును
పచ్చనైయెఱ్ఱనై పడుమూత్రముమలము వకోపుమాటలు వదరుచుండు
దాహమధికముగ దాగుచునుండును ముందువాంతియు వెన్కమూర్ఛవచ్చు
మనుజులజూచియు మదపుమాటలుబల్కు నోరుచేదైయుండునోరువాచు
గీ. పసపుచాయనునేత్రముల్ పరగుచుండు పెద్దమాటలుతరచుగాపేలుచుండు
హస్తములునాభితీవ్రమైయాడుచుండు విష్ణుబైరాగితోబల్కె విశదముగను.

తా. పిత్తజ్వరమునకుండు గుణములు - అతిసారమును, నిద్రను, అలసటను కలిగియుండును. మూత్రమును, మలమును, నెఱ్ఱగానైన, పచ్చగానైనపడును. చెడుగుమాటలు ఆడుచుండును. దాహము మిక్కిలి పుచ్చుకొనును ముందుగా వాంతి, వెనుక మూర్ఛయునువచ్చును. ప్రజలనుజూచి మదించినమాటలు ఆడును.నోరుచేదును ఎండియుండును. నేత్రములు పసుపుచాయగానుండును. పెద్దమాటలు ఆడుచుండును. చేతులును, నాభియును త్వరితముగా ఆడుచుండును అని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బలికినాడు.

## 30. కఫజ్వరలక్షణము.

సీ. కఫజ్వరంబును మీరు కరుణతో వినరయ్య ఆస్యంబుతెల్లగా నమరియుండు
దేహంబుబలియును తెలియకయుండును కాసయుశ్వాసయుఁ గలిగియుండు
అరుచిగుణమ్ములు నావళింతలుబుట్టు తిక్కయుతీటయు తిరుగకుండు
కంఠంబులోనొప్పి కలవరింపులుగల్గి పుసికట్టికళ్ళను పొనుకుచుండు

గీ. తెలుపుబారినమలమూత్రములు తెరంగు, నాల్కపై నీళ్ళు నెప్పుడు నడచుచుండు
హీనస్వరమును నైయుండు హిక్కయుండు విష్ణుబైరాగితో జెప్పె విశదముగను.

తా. కఫజ్వరమనగా శ్లేష్మజ్వరము దీనిగుణములు-ముఖము తెల్లనుండును. శరీరముయొక్క చలినివొణుంగక యుండును. కాసలును శ్వాసలును కలిగియుండును. అరుచిగుణమును ఆవలింతలును కలిగియుండును. తిక్కయు తీటయు వదలకుండనుండును. గొంతులో నొప్పియు కలవరింతలును కలుగును. నేత్రములు ఘనికట్టి పుణికింతలుగలిగి యుండును. తెల్లనిమలమును మూత్రమును పడుచుండును. నాలుకమీద నీరు కారుచుడును. స్వరహీనమయి యుండును. హిక్కగానుండును. అనివిష్ణుమూర్తి బయిరాగితో విశదముగా బలికినాడు.

## 31. భూతజ్వరనిదానము.

సీ. భూతజ్వరంబున బధురాక్షరిణతయ్యె వెఱ్ఱిమాటలు పల్కు వెతలనొందు
అన్నంబుపై చాల యాపేక్ష పడుచుండు వీనపై కనుల్ విరిసియుండు
పాడుచు నాడును పడి నిద్రబోవును పరిపరివిధముల బలుకుచుండు
విరివైనజ్వరముచే వినునకపుణుకుచు అపసవ్యములు కొన్ని యాడుచుండు
గీ. కేకవేయుచునుండును కెవ్వుమనుచు, పరువులెత్తగబోవును పట్టుకొన్న
పళ్ళుగొరుకుచునుండును పంతముగను, విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. భూతజ్వరమునకుండు లక్షణములు వెఱ్ఱిమాటలాడును వెతలబడును భోజనముమీద కోరికగానుండును నేత్రములు పెద్దవిగా విరిసియుండును పాటలుపాడుచు ఆడుచు నిద్రపోవుచుండును అనేకములుపలుకులు పలుకుచుండును విస్తారమయినజ్వరముచేతను పుణికింతలు ఆడుచు అపసవ్యపుమాట

లు ఆడుచు కెవ్వుకెవ్వున కేకవేయుచుండును పట్టుకొన్నగాని పరుగెత్తబోవును దంతాలుకొరకును అని విష్ణుమూర్తి బైరాగితో విశదముగాఁ బల్కినాడు.

## 32. అజీర్ణ జ్వరనిదానము.

సీ. లలినజీర్ణజ్వర లక్షణమువినుడి దగ్గుత్తికనుపడి దగ్గుచుండు
ఎక్కిళ్లువాంతియు నెడలుచునుండును వడిగానుజ్వరమును వచ్చుచుండు
గడియగడెకుకడుపు గట్టిగానొచ్చును దీపనలేకను దిగులుపడును
పలుమారువచ్చును పరిమళింపుచుతేన్పు కాళ్లుతీపుఁచాల ఘనముజెందు
గీ. మలముకొద్దిగజరుగును మందముగను, గబ్బుగబ్బుగనుచునుండు గర్భమందు
ఇన్నిగుణములుదీనికి నెడలకుండు, విష్ణుబైరాగితోబల్కె విశదముగను.

తా. అజీర్ణజ్వరమునకుండు లక్షణములు వెక్కివెక్కిపడుచు దగ్గుచుండును ఎక్కిళ్ళును వాంతులును వెళ్ళుచుండును కడుపులో గబ్బుగబ్బుమనుచుండును ఇటువంటిగుణములు ఈయజీర్ణమునకుండునని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బల్కినాడు.

## 33. అభిఘాతజ్వరనిదానము.

సీ. పురములో వైద్యులు పూజ్యులువినరయ్య పెద్దరోదనగాగ పేరులుచుండు
పనిచేయవలసిన వడివడినడచిన నభిఘాతజ్వరమును ననుసరించి
దానికిగుణములు దాహవిదాహముల్ చెమటదేహంబున జరుగుచుండు
అన్నతంబులెప్పుడు నాడుచునుండును కాయమెల్లనునొప్పి కలుగుచుండు
గీ. వనితమీదనుభ్రాంతియు వదలకుండు, శీతలాన్నముమీదను చింతజేయు
గుణముహీనమైయుండుగురుతులేక, విష్ణుబైరాగితోబల్కెవిశదముగను.

తా. అభిఘాతజ్వరమునకుండు లక్షణములు మిక్కిలి యేడ్చినను పనిచేసియలసినను దురుసుగా నడిచినను అభిఘాత

జ్వరము అనుసరించును. దాహమును విదాహమును దేహమం తట చెమటగలుగును. కల్లలాడుచుండును, శరీరము నొచ్చు చుండును. స్త్రీలమీద కోరికయుండును. చల్ది అన్నముమీద వాంఛయుండును. గుర్తెరుగక బుద్ధిహీనముగలుగును. అని విష్ణుమూర్తి బయిరాగితోఁబలికెను.

### 34. ద్వంద్వజ్వరనిదానము

సీ. త్వరగాను వినుడయ్య ద్వంద్వజ్వరగుణంబు చలియును జ్వరమును సంభవించు
కాళ్ళుచేతులుఁపట్టి కట్టినట్టుండును కరపాదములకును గల్గుమంట
అతిసారమునఁజేసి యతినిద్రపోవుచు ముఖముకడుపును కాళ్ళు ముందువాచు
దేహంబుతెల్లనై దాహంబుపులకించు అపవంధ్యములు చేయు నావలించు

గీ. తలనునొప్పియు తాపంబు తరుచునుండు, కడుపుకుట్టుచునుండునుకష్టపడును
గోళ్ళురెప్పలరక్తముల్ గొట్టిపోవు, విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను

తా. ద్వంద్వజ్వరగుణములు చలియు నిద్రియు అధిక ముగా నుండును. కాళ్లను చేతులునుబట్టి కట్టివేసినట్టుగానుం డును కాళ్ళుచేతులు మంటలుగానుండును. అతిసారమును నిద్ర యును కల్గును. ముఖమును కడుపును కాళ్ళును వాచును. శరీ రము తెల్లగా పాలియుండును. దేహము పులకరించుచుండును అవక్రిపుచేష్టలు చేయుచుండును, ఆవలించును. తలనొప్పియు తాపమును విస్తారముగానుండును గర్భము కుట్టుచుండును. కష్టపడుచుండును. గోళ్ళును కనురెప్పలును రక్తములేక యుం డును. అనివిష్ణుమూర్తి బైరాగితో విశదముగా బల్కినాడు.

## 35 అపథ్యదోషములు.

సీ. అరయనపథ్యంపు టపలక్షణవినుడి వేదనబడుచుండు వెతలబడును
రోమ్ముమంటయటంచు రోదనసేయుచు దబ్బరలాడుచు దగనుపడును
మూర్ఛతందిరియుగల్గి మూల్గుచునుండునుపల్లయప్రపలుక్కులుపరిబలముగను
అక్రమమాటలు నాడుచునుండును కడుపునొప్పుచునుండు గట్టిగాను
గీ. ఇన్నిగుణములు దీనికినెడపకుండు, దోషలక్షణములపథ్య దోషమనుచు
నేరుపరచియు నౌషధమియ్యవలయు, విష్ణుబయిరాగితో బల్కె విశదముగను

తా. అపథ్యదోషలక్షణములు వేదనపడును వెతలపడును. రొమ్ములోమంటచేత నేడ్చును. అబద్ధములు ఆడును. దగగలిగియుండును. మూర్ఛగలుగును. ప్రలాపపుమాటలు విస్తారముగా జెప్పును. కడుపునొచ్చును. ఇటువంటి గుణములు అన్నిటికుండును. ఇది అపథ్యదోషలక్షణమని నిర్ణయముచేసి ఔషధమిచ్చునది అనివిష్ణుమూర్తి బైరాగితో విశదముగా బలికినాడు.

ఇది బయిరాగిచేసిన ధన్వంతరివిజయమున

ద్వితీయాశ్వాసము.

# తృతీయాశ్వాసము.

## 36. నవరత్నములకు అధిపతులు.

సీ. నవరత్నములకుఁ బ్రభువులను వినరయ్య పద్మరాగము ప్రీతి భానునకును
సొంపయిన ముత్యముల్ సోమునకు ప్రియమ్ము పగడముల్ ప్రియమగు భౌమునకును
ఘనమైన బుధునకు గరుడపచ్చలు ప్రీతి పుష్యరాగము గురువునకుఁ బ్రీతి
భాసురవజ్రముల్ భార్గవునకుఁ బ్రీతి నిజము శనికిఁ బ్రీతి నీలములును
గీ. రమణ వైడూర్యములు ప్రీతి రాహువునకు, కేవలము ప్రీతి గోమేధి కేతువునకు
రత్నములు తొమ్మిదింటికిఁ బ్రభువులనుచు, విష్ణు బైరాగితో బల్కె విశదముగను.

తా. నవరత్నములకు అధిపతులు పద్మరాగములకు సూర్యుడు ముత్యములకు చంద్రుడు పగడములకు అంగారకుడు గరుడపచ్చలకు బుధుడు పుష్యరాగములకు బృహస్పతి వజ్రములకు శుక్రుడు నీలములకు శనైశ్చరుడు వైదూర్యములకు రాహువు గోమేధికములకు కేతువు. ఈ నవరత్నాలకు అధిదేవతలు.

## 37. నవరత్నాలకు శుద్ధి.

సీ. పూజితంబైన పుష్యరాగమునకు నులవనీళ్ళను శుద్ధి యుత్తమంబు
అనువైన పగడంబు లావుపాలను శుద్ధి నీలిరసమ్మున నీలమునకు
తక్కోలరసముతో తగ మౌక్తికము శుద్ధి వరికడుగున శుద్ధి వజ్రమునకు
మాదీఫలరసాన మంచిగోమేధిక శుద్ధి గావించిన సుఖము నిచ్చు
గీ. ఘనత వైదూర్యముల శుద్ధి కరకతాడి, పచ్చలకు చల్లతో శుద్ధి పాటియవును
నిజము మాణిక్యముల శుద్ధి నిమ్మపండ్ల, విష్ణు బైరాగితో బల్కె విశదముగను.

తా. పుష్యరాగము ఉలవనీళ్ళనుడికించిన శుద్ధియవును. పగడాలు ఆవుపాలతో నుడికించిన శుద్ధియగును. నీలాలు నీలి యాకులరసాన నుడికించిన శుద్ధియవును. ముత్యాలు తక్కోల

రసమున నుడికించిన శుద్ధియగును వజ్రాలు వరికడుగుతో నుడికించిన శుద్ధియగును గోమేధికము మాదీఫలరసమున నుడికించిన శుద్ధియగు వైడూర్యము కరకతాడిరసమున నుడికించిన శుద్ధియవును పచ్చలు చల్లతో నుడికించిన శుద్ధియవును మాణిక్యము నిమ్మపండ్లరసముతో నుడికించిన శుద్ధియవును ఈనవరత్నములకు శుద్ధులు చేయుప్రికారములు.

## ౩8. నవరత్నభస్మయోగము.

సీ. మాక్షికటంకణ మణిశిలగంధక దరదములీరసమును దాళకమును
అర్కక్షీరములతో నమవుగానినూరి జెముడుపాలనుకొంత సేపునూరి
నవరత్నములనిండ నలదిగాడ్పార్చియు వజ్రపుమూసలో వరుసగాను
గజపుటంబులు మూడు గట్టిగావేసిన మృతిబొందు భస్మమౌ మృదువుగాను
గీ. వైనముగమీరువినరయ్య వైద్యులార, వజ్రవైక్రాంతములకొక వరుసగాను
పుటములనువేయుమనుచునుపుడమిలోన, విష్ణుబైరాగితో బల్కెనిశదముగను.

తా. మాక్షికమును, వెలిగారమును, మణిశిలయును, గంధకమును, ఇంగిలీకమును, పాదరసమును, తాళకమును, ఇవి అన్ని జిల్లేడుపాలనూరి జెముడుపాలను కొంతసేపు నూరి యిదిరత్నములపైనిండరాచి గాల్పార్చి వజ్రపుమూసలోనుంచి మూడు గజపుటములు వేసిన భస్మమవును. వజ్రములకును వైక్రాంతములకును శుద్ధులును భస్మను చేసేప్రికారమును ఒక్కరీతిగానె వేయవలసినది.

## ౩౨. పాషాణముశుద్ధి.

సీ. పాషాణములశుద్ధి పటిమగావినరయ్య జంబీరరసముతో జామునూరి
అదిబిళ్ళవలెజేసి యార్చిమూసనునిడి యొకజాముతేనెతో నొనరవండి

వెల్లుల్లిరసముతో వేసినన్నొకజాము విషముహరించియు విమలమవును
నింబపిత్తులతోను నిజముగా నొకజాము వండినశుద్ధియా వరుసగాను

గీ. మూడుపాషాణములకెల్ల మూలమైన శుద్ధినీరీతిజేసిన సుఖమునిచ్చు
హానిదప్పించు నౌషధ మమృతమనుచు, విష్ణుభైరాగితోబల్కె విశదముగను.

తా. పాషాణమును శుద్ధిచేయుప్రకారము నిమ్మపండ్లరసమున జామునూరి అదిబిళ్ళవలెజేసి ఆరించి పిమ్మదలోనుంచి యొకజాము తేనెతో వండవలయును వెల్లుల్లిరసము నొకజాము వేసిన విషముహరించి స్వచ్ఛముగానుండును వేపపిత్తులరసము ను ఒకజాముఉడికించిన శుద్ధియగును. ఉల్లిపాషాణమును గౌరిపాషాణమును దొడ్డిపాషాణమును యీమూడు పాషాణములకు శుద్ధి యీప్రకారముగా చేసిన పక్షమున సుఖమునిచ్చును. హానితప్పించివేసి ఔషధము అమృతాన్నరూపమవును.

## 40. నాభిశుద్ధి.

సీ. వినరయ్యజనులార విన్నపములురెండు పొత్తుదుంపయునాభి పొందుగాను
అందులోవసనాభి యనుకూలమైనదే శుద్ధిమీకెరిగింతు సూక్ష్మముగను
అడ్డెడుపంచిత మటికలోపలఁబోసి నాభినందులో నానవేసి
ఒకదినముంచియు నొగివసనాభియు చనుబాలఁగడిగిన చక్కగాను

గీ. సరసులీరీతిఁజేసిన సరసముగను, విషముతిక్కయు రెండును విరిగిపోవు
అన్నిరోగాలకిదియనుహర్షమనుచు, విష్ణుభైరాగితోఁబల్కె విశదముగను.

తా. విషములు రెండుఅనఁగా పొత్తుదుంపయొకటి నాభియొకటికలవు. ఈరెంటిలోను వసనాభి ప్రశస్తమయినది దానిశుద్ధి చెప్పుచున్నాను అడ్డెడు పంచితము అటికలోపోసి యీనాభి అందులో నానవేసి ఒకదినము నాననిచ్చి తీసి చనుబాల

నుకడిగి ఆరించిన శుద్ధియవును. విషగుణములును తిక్కలును ఈగుణములును పోవును. సమస్తరోగములును నగ్గును.

## 41. నేపాళములశుద్ధి.

సీ. నేపాళములశుద్ధి నేర్పుగావినరా గోవుమూత్రములోన గోమయంబు
కలిపియు రెండును గట్టికుండనుబోసి యవిరియొలచియు వానియందుఁ జోసి
రేయును బవలును రెండురోజులువండి నీళ్ళనుకడిగిన నేర్పుగాను
అదియావుపాలను నరజాముఁవండి నేతనునరజాము వేచినవియన్ని

గీ. దీసి యెండించినను శుద్ధి చెన్నుగను, ఘనవైద్యులుమీరలు గట్టిగాను
మందులనువైచినను మీకుమంచిదనుచు, విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. ఆవుపంచితము లోను ఆవుపేడకల్పి రెండును కుండలోపోలి నేపాళములువలిచి ఆకుండలోపోసి రాత్రింబగళ్లు రెండురోజులువండి అవితీసి నీళ్ళనుకడిగి ఆవుపాలను అరజాము వండి నేతితో అరజాము వేయించితీసి ఎండించిన దివ్యమవును మీరు ఔషధములలోనుంచుకొనిన అనుకూలముగా నుండును.

## 42. శొంఠివగయిరాలశుద్ధి.

సీ. శొంఠిపైసున్నము సొంపుగరాచియు గాచినశుద్ధియుఁ గలుగునదియు
ఒగివపిప్పిరసమున నొకజాము నెండింప వైదేహశుద్ధియౌ నయినముగను
చల్లలోమిరియాలు చక్కగ తడపియు వేచినశుద్ధియు వేగమవును
వాముసున్నపునీళ్ళ వండిననొకజాము హర్షమైయుండెడి నందటికిని

గీ. నీళ్ళవెలిగారమునగల్పి నిప్పమీఁద గాచిననుశుద్ధిగలుగును కసరుబోయి
యింగిలీకము చనుబాల నెసఁగుశుద్ధి, విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. శొంఠిపైన సున్నమురాచి నిప్పులమీదను వేసిన శుద్ధియవును. పిప్పళ్లు చిత్రమూలరసమున తడిపి యెండనిచ్చిన శుద్ధియవును. చల్లతో మిరియాలు తడిపిన శుద్ధియవును. వాము

సున్నపునీళ్ళను ఒకజాముడికించిన శుద్ధియవును. ఇంగిలీకము చనుబాలను ఉడికించిన శుద్ధియవును.

సీ. పాలతుత్తము సన్నపాటిగుడ్డఁగట్టి సున్నపువంటచే శుద్ధివచ్చు
మాయూరతుత్తము మంచిపెరుగుననూరి యుడికించి యొప్పైనను త్తమమగు
మణిశిలయనునది మంచిదిగాఁదెచ్చి జమిలిగుడ్డఁగట్టి జతనముగను
గోమూత్రముకొంత క్రొత్తకుండను బోసి మణిశిలపుల్లను మరగఁగట్టి
గీ. కుండలోనంచులోనిదికూర్చి మరియుమూఁడుదినములు యంత్రమునదమిార
వండినను శుద్ధివచ్చును వాటముగను, విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను.

తా. పాలతుత్తము సన్నపాటిగుడ్డనుమూటఁగట్టి సున్నపునీళ్ళతో వండిన శుద్ధియవును. మైలతుత్తము పెరుగుతో నూరి యుడికించిన శుద్ధియవును. మణిశిల జమిలిగుడ్డనుకట్టిన మూట గోమూత్రము క్రొత్తకుండలో పోసి మణిశిల పుల్లనుగట్టి కుండ లోనంచులోనిదికూర్చి మూఁడుదినములు దోలాయంత్రమున వండిన శుద్ధియవును.

## 43. పాదరసశుద్ధి.

సీ. పాదరసమ్మును పాటించిచిననరయ్య కందదుంపరసంబు కలగరాకు
వావిలజిల్లేడు వజ్రవల్లిరసమ్ము కలిసినిప్పునుసిరిక కరకతాడి
రాజవృక్షరసంబు రాతిసున్నపునీరు చిత్రిదొగ్గలిపప్పు బొత్తి పెరుగు
కరభూపమునునిమ్మ గలిజేరురసముల నొక్కొకరసముతో నొక్కజాము
గీ. నూనిగుడ్డనువడపోసి మానుగాను, సప్తదోషంబులునుపోవు చల్లగాను
ఔషధంబుల పాళ్ళను హర్షమునను, విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను.

తా. పాదరసముశోధించేయుప్రకారము—కందదుంపరసమును, గుంటకలగరాకు రసమును, వావిలాకురసమును, జిల్లేడు

పాలును, నల్లేరురసమును, కలినీళ్ళును, ఉసిరికకాయరసమును, కరక్కాయరసమును, తాడికాయలరసమును, రేలాకురసమును, రాతిసున్నపు నీళ్ళును, చిత్రికూరరసమును, దొగ్గలికూర రసమును, పచ్చిపసుపురసమును, గేదెపెరుగును, కరిదూపమును, గలిజేరురసమును, నిమ్మపండ్ల రసమును, యీ చెప్పినరసములను ఒక్కొకజాము నూరి గుడ్డను వడపోసిన నేడుదోషములు పోయి చల్లగానుండును. ఔషధముల పాళ్ళకు హార్షముగానుండును.

## 44. తాళకముశుద్ధి.

సీ. పత్రితాళకమును పరిశుద్ధివినరయ్య పచ్చనరేకులిం పలుజేసి
ఆరేకులన్నియు నటికెలోపల బెట్టి అందులోపంచిత మమరబోసి
పదమూడుజాతులు పటిమగామంటచే చక్కగాశుద్ధియౌ సరసముగను
శుద్ధియౌనొకరోజు సున్నముతోనుండ జంబీరరసమున జాముశుద్ధి
గీ. ఔషధపుపాళ్ళకిదియును నందియుండు, శుద్ధగలిగినజనులకు సుఖమునిచ్చు
శుద్ధిగాకున్నరోగుల సుఖముచెడును, విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. తాళకము రేకులుగావలిచి అవికుండలో బెట్టి పంచితముపోసి పదమూడుజాములు పటిమగా మంటవేసిన అనుకూలమయినటువంటి శుద్ధియవును. ఒకదినము సున్నపునీళ్ళతోనువండ శుద్ధియవును. నిమ్మపండ్లరసమున నొకజాముఉడికించిన శుద్ధియవును. ఔషధములలోనికి అనుకూలముగానుండును. శుద్ధియయినతర్వాత శుభమునిచ్చును. శుద్ధిగాకున్నపక్షమున సుఖముచెడిపోవును. అని విష్ణుమూర్తి బైరాగితో విశదగా చెప్పినాడు.

## 45. గంధకశుద్ధి.

సీ. ఘనులారవినరయ్య గంధకశుద్ధియు కలినీళ్లు కలబంద కలగరాకు
ఆవుపాలును ఘృతమడ్డసరమ్ములు మొగిలిగజ్జెరు మును మోదుగయును
ఇన్నిరసంబులు నివి చట్టిలోఁబోసి చట్టిమీదనుబట్ట సర్దికట్టి
గంధకముపొడిగ గట్టిగానూరియు గుడ్డపైబోసియు కూర్మితోను
గీ. బొగ్గునిప్పులు బొరుసులోఁబోసిమఱియు। చట్టిమీఁదనుబెట్టినచక్కగాను
పచ్చజొన్నలరీతిని బారుననుచు। విష్ణుబయిరాగితోఁబల్కె విశదముగను.

తా. గంధకము శుద్ధిచేయు ప్రకారము కలినీళ్ళును, కలబందయు, గుంటకలగిరాకురసమును, ఆవుపాలును, ఘృతమును, అడ్డసరము, గలిజేరు, మొగలిరసములును, మునుమోదుగరసమును ఈరసములన్ని ఒకచట్టిలోబోసి ఆచట్టిమీదను బట్టవాసెనగట్టి బొగ్గునిప్పును బొరుసులోబోసి చట్టిమీదను పెట్టిన పచ్చజొన్నలవలె కుండలోనికి దిగును. అమృతశిల గంధకమవును.

## 46. తామ్రశుద్ధి.

సీ. రాగిరేకులువేసి రంగుగాఁ గాల్చియు నులవనీళ్లనుముంచి యుంచవలయు
తరువాతదీసియు తరుచుగాగూర్చియు మత్స్యాక్షిరసమున మరలముంచి
తీసికాల్చియునది తింత్రిణీరసమున ముమ్మారుగాల్చియు ముంచవలయు
ఏడుమారులుగాల్చి యెమ్మెచల్లనుముంచ శుద్ధిగలుగునిది శుభమునిచ్చు
గీ. అధియుండగ శుద్ధిగాకున్న హానివచ్చు। బుద్ధిమంతులునెవ్వరైన భూమిలోన
సరసముగఁ జేయుఁడీరీతిచక్కగాను। విష్ణుబయిరాగితోఁబల్కె విశదముగను.

తా. రాగి రేకులు ఎఱ్ఱగాఁగాల్చి ఉలవనీళ్లనుముంచి తరువాత దీసి తరుచుగా కాల్చి పొన్నగంటి రసములో ముంచి తిరుగ దీసి కాల్చి చింతాకు పసరులో ముమ్మారు ముంచి యే

డుమారులు కాల్చి యేడుమారులు పులిచల్లలో ముంచిన శుద్ధి యవును. ఈతామ్రము శుద్ధికాకపోయిన హానివచ్చునుగనుక చక్కగ పయిన చెప్పినప్రకారము శుద్ధిచేయవలసినది.

## 47. పంచలవణశుద్ధి.

సీ. లవణమ్ము సైంధవలవణమ్ము కలితోడ మర్ధించియార్చిన మంచిశుద్ధి
సౌవర్చలవణమ్ము సరసమౌగోమూత్రమున శుద్ధిపొందును ముదముమీర
లక్ష్యంబుగల బిడాలవణంబుచల్లచే మర్దించియెండింప మహిమగలదు
గలిజేరురసమును కాచలవణమును గలిపియెండించినగలుగుశుద్ధి
గీ. తింత్రిణీపత్రిరసమును దీసితడిపి ముఖ్యముగవేచశుద్ధి సముద్రలవణ
పంచలవణాలశుద్ధియీపగిదినమరు విష్ణుబయిరాగితోఁ జెప్పె విశదముగను.

తా. సైంధవలవణము కలిబోసినూరిన శుద్ధియవును. సౌవర్చలవణము గోమూత్రమునసూరి యార్చిన శుద్ధియవును. బిడాలవణము పులిచల్లతో మర్దించి యెండించిన శుద్ధియవును. చింతాకు రసమున దడిపి సముద్రలవణము వేచిన శుద్ధియవును. అయిదులవణములశుద్ధులు నీరీగాజేయవలెను.

## 48. గుగ్గిలము శుద్ధి.

సీ. వినరయ్య మీరలు విమలమౌసున్నపు నీళ్లమర్దించి నేర్పుగాను
ఆవుపంచితమును నరటిసానయుఁగల్పి కుండలోఁబోసియుఁ గూర్మితోడ
యంత్రనఁ దగరెడు యామముల్వండించి చల్లార్చననుశుద్ధిచక్కగాను
సారిదిగుగ్గిలమును కరకతాడిరసాన నరగడెనూరియు ననువుగాను
గీ. ముద్దగాఁజేసి గుడ్డనుమూటగట్టి నాల్గుగడియలువండిన నయముగాను
శుద్ధివచ్చును జనులను సుఖముననమ। విష్ణుబయిరాగితో బల్కె విశదముగ

తా. విమలము శుద్దిచేయుప్రకారము. గుగ్గిలము సున్నపునీళ్లనునూరి ఆవు పంచి మును, అరటిచెట్టు రసమును, క

ఈమూాడురసములును కుండలో సి యీావిమలము మూ గట్టి పుల్లనువే్రిలాడగట్టి కుండలో మీాదనుంచి డోలాయంత్రమున రెండుజాములు వండి చల్లార్చిన శుద్ధియగును. ఈగుగ్గిలము కర క తాడికా లరసమున అరగడియనూరి అవి ముద్దచేసి గుడ్డను మూాటగట్టి నాలుగుగడియలు వండిన శుద్ధియై మూానవులకు శుద్ధినిచ్చును.

4౨ 1 ఇంగువశుద్ధి, 2 యవక్షారశుద్ధి, 2 సజ్జాక్షారశుద్ధి సజ్జాకారశుద్ధి, గజపిప్పళ్ల శుద్ధి.

సీ కలిసజ్జక్షారము కలి మర్దించిన నంతలోశుద్ధియా నారెనేని
యెరడాపుకడుగుల యవక్షారమునునూరి తడిపియార్చినశుద్ధి తిర్వకుండ
సజ్జకారముశుద్ధి చనుబాలనూరి నీడనార్చినశుద్ధినిజముగాను
గట్టిమూాకుటిలోన గజపిప్పలిం సి వేధినశుద్ధియుం వేగమవును

గీ. అరయునరవిందరసమును నమరం సి యింగువయు జామునూ న ని శుద్ధి
శాస్త్రసమ్మత మిదిమీారు సల్పు డనుచువిఘ్నబయిరాగితోంబలె విశదముగను

• కలితోను సజ్జా రము కలియనూరి ఆర్చిన శుద్ధి యూాను రడవు కడుగుతోను యవక్షా ముతడి యార్చిన ద్ధియూాను సజ్జాకారము చనుబాల నుడి ంచిన శు యూాను గజపిప్పళ్ళు మూాకుట్లోవేసి వేయించిన శుద్ధియవును తామ ర ముదీ యింగువ జామునూరిన శుద్ధియవును ఇదిశాస్త్రసమ తమయిన.

౦0 బంగారముశుద్ధి.

సీ. గాయశుద్ధిని బా గావివరయ్యు వెలిగార నుగ గి
యెమ్మె రేవలంజే జ్జ్వబురదని డ నలది న శ్శునార్చి

యారేకులుగడిగి యావుపాలనుజాము నుడికించఁగాఁజాలయుత్తమమవు
ఉడికించవలెవెన్క నులవనీళ్లనుజాము పటిమగానుడికించి పంచితమున
గీ. కలినినొకజాముడికినను గట్టిగాను। కల్మషముబాసి కనకము కాంతివచ్చు
నెవరు నీరీతి చేసిన నెన్నికనుచు। విష్ణుబయిరాగితోఁబల్కె విశదముగను.

## 51 సూతకభస్మము.

సీ. బడబాగ్నిమూలము పటికదుత్తూరము కలబంద హేరండ కటుకత్రయము
ఆ లునుప్పును నార్ద్రక సౌవీర మునువీటిలో సూతము విడవలదు
కల్వమ్మునం బెట్టి కలియంగమర్దించి కుప్పియగాఁజేసికుండలోన
సాముద్రిమునుబోసి సరగుననిదిబెట్టి మీఁదసాముద్రంబు మిన్న జేసి
కుండపై మూకుడు కుదురుగాఁజేసియు గుడ్డమన్నునుజుట్టి గురిగజుట్టి
గీ. బాగుగాపొయిమీఁద భాండమ్ము బెట్టియు పదిజాములనుమంటప్రోలజేసి
శీతలంబునఁదీసి శీఘ్రముగనుచట్టి చుట్టుమన్ను చదరగ సారిదిజేసి
గీ. బట్టదీసిన పైకుండబట్టియుందు, తెల్లగాభస్మమైయుండు తేజమెసఁగ
సూతభస్మంబుచే సెడినూటియిదియు, విష్ణుబయిరాగితోఁబల్కె విశదముగను

తా. చిత్రమూలము వేరును, పటికయు, ఉమ్మెత్తవేరును, లబందయును, ఆముదపు వేరును, శొంఠి, పిప్పలి, మిరియా [illegible], ఆవాలును, ఉప్పును, అల్లమును, సౌవీరమును, వీ. అ [illegible] ను, పాదరసము నూరి కల్వములో ఉంచి మర్దిం ప్పజేసి కుండలో ఉప్పుపోసి ఆపైని ఈకుప్పెపై ఆమీఁదను ప్పుపోసి కుండమీఁద మూకుడు కుదురుగాజేసి గుడ్డజుట్టి మన్ను చుట్టు మెత్తి యీకుండ పొ---మీఁద బె పదిజాములు మంట బెట్టి చల్లారినతర్వాత [illegible] సి [illegible] డ అంచుచుట్టుమన్ను విప్పివేసి కు [illegible] మి [illegible] సు [illegible] దు తీ[illegible]న మూకుడును పట్[illegible] కొని [illegible] ందును.

## 52. రసభస్మగుణము.

సీ. పారదభస్మము పటిమజెప్పెదనయ్య శొంఠిపొత్తునుజేసి సొంపుగాను
అం రసంబున నదిగడెనుర్దించి అయిదుపూటలుదినుడౌషధమును
సప్తదినమ్ములు చప్పిడిచేసియు నెనిమిదింటనుఉప్పు దినఁగవలయు
పక్షంబునీరీతి పథ్యంబుజేసిన వాతగుల్మమ్ములను వాయువులను
గీ. మూర్ఛగళరోగశూలలుమూత్రకృఛ్ర,గండమాలలుకుష్టువుల్ కడకుఁదొలఁగు
కడుపునొప్పులుమాన్పునుకఫమునడఁచు, విష్ణుబైరాగితోఁబల్కెవిశదముగను.

తా. పాదరసముయొక్కగుణము. శొంఠి యీభస్మము లోవేసి చిత్రమూలపురసమున ఒకగడియనూరి అయిదురోజులు పుచ్చుకొని యేడురోజులు చప్పిడి అన్నము తినవలయును. ఎనిమిదవరోజున ఉప్పువేసుకొనవలెను. పదునేనురోజు లీలాగు పథ్యముజేసిన వాతగుల్మములును, వాయువులును, మూర్ఛరోగములును, గళరోగములును, శూలలును, మూత్రకృఛ్రరోగములును, గండమాలరోగములును, కుష్ఠరోగములును కడుపునొప్పులును మానును. కఫములణఁగును.

## 53. అభ్రకభస్మము.

సీ. వైద్యులందఱుమీరు వరుసగావినరయ్య యభ్రకంబులునాలుగవనిలోన
అందునాల్గిటనొక్క డమృతంబుసరివచ్చు కృష్ణాభ్రకంబును -ర్మితోను
రాత్రిరోట నదియుంజముగదంచియు కలిబోసికాచిన గలుగుశుద్ధి
కలువంబునవిడియు కలితోడమర్దించి మూసమూలోబెట్టిమూతగప్పి
మూడుపుటమ్ములుముదమొప్పఁగావేసి యది యావుపాలతో నమరనూరి
గజపుటంబులుమూడు గట్టిగావేసియు నర్కక్షీరముచేత నారవేసి
గీ. కుంజరాశనరసమునఁ గూ మూఁడు, మఱియునులవలనీళ్ళను మరఁ నాలు
నిన్నిపుటములభస్మమా పుగాను, ఔషధంబుల నిడవ హర్ష గను

తా. వైద్యులందఱు వినవలసినది. భూమియందు నాలుగు అభ్రకములుగలవు. ఇందులో అమృతముతో సమానమయినది కృష్ణాభ్రకము. ఆయభ్రకమును రాతిరోటను వేసి చూర్ణముగాదంచి కలిపోసిఉడికించిన శుద్ధియవును. ఇది కల్వములో పెట్టి కలితో మర్దించి మూకుడులో బెట్టి పయినమూకుడు గప్పి కలినినూరి యది మూడుపుటములు వేసి తరువాత జిల్లెడుపాలతోను, రావిచెక్కరసానినూరి మూడుపుటములువేసి మ యూడలరసానినూరి మూడుపుటములువేసి యులవనీళ్ళను నూరి మూడుపుటములువేసి యిన్నిరసములచేతను పుటములు వేసినయుక్తమయిభస్మమవును. ఔషధమువాడుటకు అనుకూలముగానుంచవచ్చును. ఈతీరున వేసినభస్మముబహుశ్రేష్ఠమవును.

## 54. సింధూరభస్మము.

సీ. అభ్రకసిధూర మదిచేయువిధమును వినుఁడయ్యచెప్పెద పెద్దలార
కలబంద కానఁగ గలిజేరుసర్పాక్షి పొన్నగంటినుగంధి పాలఁపుమీఱ
దుష్టపుపెన్నేరు దూలగొండియునుప్పి కారుములగనల్ల కలఁపదుంప
భూ తులసి పలాశముంగులఁభృంగియు నేలగుమ్మడియును నేలతాడి
వావిలడ్డసర బు వాకు గదంబ జెముడుఁజంబును నిమ్మక్రమముగాను
ఒక్కొక్కరసముల నొక్కొక్క దినమును మర్దించిపుటములమరఁగవేయ
అభ్రకసింధురం బద్భుతమ్ముగ సురలకు సుధయోట్లు సులభముగను
గీ. జనులకమృతంబునిదియును జగతిలోన,నిదియుభక్షించువారికినిహమునపరము
మృత్యుభయమునుదప్పించుముదమునిచ్చు,విష్ణుబైరాగితోబ విశదముగను

తా అభ్రకసింధూరముచేయు [illegible] రము [illegible] ప్పెదను. కల -ందను, గానుగ [illegible] గల [illegible] రును సర్పాక్షి [illegible] పొన్నగంటిని

సుగంధిని, దుష్టపురసంబును, పెన్నేరును, దురదగొండియును, నుప్పిరసమును, కారుములగాకును, నల్లకల్వమంపలును, భూతులసియు, మోదుగయు, గుంటకలగరయు, బోడసరమును, నేలగుమ్మిడియు, నేలతాడియు, వావిలియు, అడ్డసరమును, వాకుడును, కడిమి, జెముడును, నేరేడును, నిమ్మరసమును, ఒక్కొక్కరసమును ఒక్కొక్కదినము మర్దించి ఒక్కొక్కపుటము వేసిన అభ్రకసింధూరమవును. దేవతలకు అమృతము ఎటువంటిదో మానవులకు ఈయభ్రకసింధూరము అటువంటిది. మృత్యుభయము దప్పించి సంతోషము నిచ్చును.

## 55. ఉక్కుభస్మము.

సీ. ఉత్తమమైనట్టి యుక్కురాపిడిజేసి పరగనూనెనుజాము వండవలయు
జలములతోఁగడ్గి జామెండలోఁబెట్టి నల్లతుమ్మరసమ్మునవాగిబోసి
అదినాల్గుగడియలు నమరవండియు వార్చి తీసివేగంబున దివ్యముగను
జంబువృక్షరసాన జాము నేపుడికించి మర్దించియెండించి మరలదాని
ఆమలకరసాన నరజాముడికించి యొగినూరియెండించి యున్నదాని
తింత్రిణీరసముతో తిరగంగనుడికించి యెండించినుడికించి యొసఁగవేగ
ములగతో నూరియా నుదముతో నెండించి గోమూత్రమునగా గొప్పగాను
గీ. మూకిటను యామీద మూతగప్పి, గజపుటము వేసి నట్టయిన గట్టిగాను
భస్మమైయుండునిదియును భాసురముగ, షణ్బెరాగితో బల్కెవివిదముగను.

ఉత్తమమైన ఉక్కురాపిడిగా గోసి నూనె వేసి జాము వండించి అది నీళ్ళుపోసి కడిగి ఒకజాము ఎండించి నల్లతుమ్మరసము పోసి నాలుగుగడియ వండించి దితీసి నేరేడురసాన జాముడికించి యెండించి మరల నిలో నుసిరికాయ

రసాన నాలుగుగడియ లుడికించి నూరి యెండించి చింతాకు రసాన తిరుగనుడికించి యెండించి మర్దించి యిది ములగాకురసాననూరి యెండించి గోమూత్రాన నుడికించి యిది మూకుట్లో పెట్టి ఆపయిన మూకుడుగప్పి గజపుటము వేసిన మిక్కిలి ప్రకాశమానముగా నుండును.

## 56. ఖడ్గభస్మము.

సీ. డ్గభస్మంబును కల్వంబులో బెట్టి వినరాగిరసమున విడియనూరి
దిబిళ్లలనుజేసి యా ౖ మూకిట బెట్టి ఆర్నొకగజపుట మమరవేసి
తిప్పతీగరసము తీసిమర్దించియు పుటము లేడిటువేయ బొల్పుగాను
ఆవుపంచితమునవర లేక తెగనూరి యెండించిపుటములు నేడువేయ
మునుపాకురసాన మురుసుగానూరియు నార్చిపుటము వేయ నైదురెండు
అర క్షీరముతోడ ననువుగమర్దించి గజపుటములు నేడు గాగజేసి
యిక్షురసమ్మున నిది నూరివిడువక వడిగజపుటములు వరుస నేడు
గీ. ఇన్నిపుటములు వేయగానినునికాంతి, అవునులోహంబుమిక్కిలియందముగను
జనములీరీతిలోహంబు సలుపుడనుచు, విష్ణుబైరాగితో బల్కెవిశదముగను.

తా॥ కటారికోసిన రాపిడిభస్మము కల్వానబోసి చెముడుకాడల రసాననూరి అది బిళ్ళచేసి మూకుట్లో పెట్టి యేడు గజపుటములువేసి ప్పతీగరసాననేడుపుట లువేసి దుష్టుపాకు రసమున నూరిఆర్చియేడు టములువేసి జిల్లేడుపాలతో నేడుపుట లు చెరుకుఆకురసాన నే టములువేసి ని పండ్లరసాన పుటములువే న్నిపుటములును నీలాగున న సూర్యకాంతి వ ఈచందము, లోహము అవును

## 57. బంగారుభస్మము.

సీ. బంగారురేకులు బలువుగావేయించి భస్మము వేయుట బాగుగాను
మాదీఫలరసాన మరిరసభస్మము గడియమర్దించియు గట్టిగాను
బంగారురేకుల బట్టించివత్తుగా మూసలోబెట్టియు మూతగప్పి
గొప్పపిడకలతోడ గొప్పపుటము వేయ బంగారుభస్మమూ భాసురముగ
గీ. ప్రజలునీభస్మముందిన్న ప్రబలముగను, రాజ్యమును సిరియును సంపదరాజసమును
గట్టిగానెవరుజేసిన గల్గుననుచు, విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. బంగారు పల్చని రేకులుగా వేయించి మాదీఫల రసముతో మంచిరసభస్మమునూరి యీ రేకులకు వత్తుగా పట్టించి మూసలోనుంచి మీదను మూసమూసి ఆవుపేడపిడకలతోను గొప్పపుటము వేసిన బంగారము రేకులు భస్మమగును మానవులీ భస్మమును పుచ్చుకొనిన రాజ్యమును, సిరిసంపత్తునుగలుగును.

## 58. కాంతభస్మయోగము.

సీ. కాంతపురాళ్ళను కాల్చి పుల్లనిచల్ల ముంచినశుద్ధియౌ నుదముమీర
గంధకమరపాలు కాంతంబులోపెట్టి కొండపిండియునొమ్ము గొరవిడాకు
ఆస్ఫోటరసమును నాకింశుకంబును నిమ్మపండ్లరసాన నింపుగాను
ఒక్కొక్కరసముతో నొక్కొక్కయామము నూరిమూసను బెట్టితోరముగను
గీ. నైదుపుటములు వేసిన మోదుగను, కాంతభస్మము నైయుంచు ఘనతమిగుల
జౌషధంబులనిడుటకు నలవియగును, విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. కాంతపురాళ్ళు అనగా సూదంటురాళ్ళు ఎర్రగా కాల్చి పులిచల్లలో ముంచిన శుద్ధియగును. కాంతములోన గంధకము అరపాలు పెట్టి కొండపిండియాకు రసమును కొమ్ము గొలిమిడాకు రసమును, జిల్లెడురసమును, మోదుగ రసమును,

నిమ్మపండ్ల రసమున్ను, ఒక్కొక్కరసముతో నొక్కొక జాము మర్దించి మూసలో బెట్టి అయిదుపుటములు వేసిన భస్మమయి యుండును ఔషధములలోనికి అనుకూలమయియుండును.

## 59. కాంతసింధూరరసము.

సీ. కాంతభస్మములోనగల్పి హింగుళమును సమము రెండును జేసి పరసముగను
మక్కటరసమునమర్దనజేసియు నెఱ్ఱమన్నునమూస నొండజేసి
యామూసలోనుంచి యాపైనమూసియు యెఱ్ఱపంకము మెత్తి యెసగవార్చి
గజపుటంబులుమూడు ఘనముగా వేసిన బాలసూర్యునిబోలి భాసురముగ
గీ. కాంతసింధూరమువునయ్య నులకివియు, నేలకలవంగదాల్చినియేకముగను
గల్పిశర్కరతో దిన్న కాంతివచ్చు, విష్ణుబైంగితో బల్కె విశదముగను.

తా. కాంతభస్మమును ఇంగిలీకమును సమముగా జేర్చి దూలగొండరసాన మర్దించి యెఱ్ఱమన్ను మూసజేసి యెండించి ఆమూసలోనిదియుంచి యాపైన మూతమూసి యెఱ్ఱబురద రాచి యార్చి మూడు గజపుటములువేసిన పొద్దుపొడుపును బోలినటువంటి ప్రకాశమానమైన కాంతిగలిగిన సింధూరము ఘనులయినవారికి యాలకులును, లవంగములును, దాల్చినిచెక్కయు నేకముగానూరి కలిపి యీయౌషధమును పంచదారతో నిచ్చిన చాలకాంతి గ గును.

## 60. తాళకభస్మము.

కభస్మ ధవళితంబగురీతి తెలిసినంతదిమీకు దెల్పవాడ
పండ్లరసాన నిజతాళకమ్మును బింకముగానూరి బిళ్ళచేసి
పనార్ధక్షార శ్వత్థక్షార క కు డను బోసి గాను
కాగములు వాబిళ్ళనుంచి నమన్నింట చూడగ

కుండను బోయిమీఁద కదురుగా నుంచియు మూకుడొకటి పైన మూతగప్పి
పదిజాములును మంట పటిమతో వేసిన తేటయౌ భస్మమై తేజరిల్లు
తోడ భస్మము వెన్నతో దిన్న యపుడు జ్వరములన్నియు వేగ జరుగుచుండు
గీ. రోగములు బాఁచిపోవును రోజు లణఁగు, వాత పైత్యము కష్టముల్ వదలుచుండు
తాపములు వాంతి జాడ్యముల్ తంద్రగుణము విష్ణుబైరాగితో బల్కె విశదముగను

తా. తాళకభస్మము తెల్లగా నగు ప్రకారము. తాళకము నిమ్మపండ్ల రసమున నూరి బిళ్ళ చేసి ఉత్తరేణిబూడిదను, గావికట్టెల బూడిదను రెండును కలిపి కుండలో పోసి ఆబూడిదల మధ్యను ఈబిళ్ళనుంచి చుట్టును చూరుగా కట్టడమును, ఆ కుండ పొయిమీఁదనుంచి పయిన మూకుడు మూసి పదిజాములు గాఢాగ్ని మంటవేసిన తెల్లగా భస్మము ప్రకాశించుచుండును. ఈభస్మము వెన్నపూసను కలిపి పుచ్చుకొనిన జ్వరములన్నియు జడిసిపోవును. రోగములు పారిపోవును. రోజుగుణములు మానును. వాతమును, పైత్యమును, కష్టమును వదలిపోవును. తాపమును వాంతి జాడ్యమును, తంద్రిగుణములును వదలి పోవును.

## 61. కాంస్యశుద్ధి.

సీ. కంచుశుద్ధి నిమీరు గట్టిగా వినరయ్య చింతాకుపసరున శీఘ్రముగను
పదిమార్లు గాల్చియు పసరులో ముంచిన కంచుశుద్ధియగును గడియలోన
కంచుతో సమమును గంధకమును వెట్టి యర్కక్షీరము తోడ నదియు నూరి
ఆకంచురేకుల కారారఁబట్టించి వజ్రిమూసను వేసి వరుసగాను
గీ. సప్తపుటములు వేసిన సరసముగను| భస్మమైయుండు మూసలో భాసురముగ
ఔషధంబుల పాళ్ళకు నమృతమిదియు, విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. చింతాకుపసరు బోరుసులోపోసి పదిమార్లు ఈ కంచు రేకులు కాల్చి పసరులోముంచిన కంచు శుద్ధియవును. గడియలో కంచు రేకులకు సమముగా గంధకము పెట్టి జిల్లేడుపాలను నూరి యీ రేకులకు ఆగారగ పట్టించి యేడుపుటములు వేసినఅది ప్రకాశమానమైన భస్మమవును. ఔషధములపాళ్ళకు ఆకృతిస్వరూపమయి యుండును.

### 62. కంచుభస్మయోగము.

సీ. కంచుభస్మమురస గంధకదరదము లివినాల్గుసమముగ నింపుజేసి
అశ్వత్థమోదుగ హంసపాది కుంజంబు దూలతామర నల్లతుమ్మ నిమ్మ
ఒక్కొక్కరసముతో నొక్కొకదినమును నూరిమూసనునిడి తోరముగను
ఆరునొక్కపుటమ్ము లమరంగ వేసిన బాలసూర్యునిమించు భాసురముగ
గీ. కంచుసింధూరమవునయ్య ఘనులుబొగడ, అల్లమనుపానమౌషధ మడ్డిగెత్తు
అనుదినంబును దిన్నను నఘము బాయు, విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. కంచు భస్మమును, రసమును, గంధకమును, ఇంగిలీకమును, ఇవి నాలుగు సమముజేసి రావిచెక్క రసమును, మోదుగచెక్కరసమును, హంసపాదియాకు రసమును, నేరేడు చెక్క రసమును, దూలతామరరసమును, నల్లతుమ్మరసమును, నిమ్మపండ్ల రసమును, ఒక్కొక్కరసముతో ఒక్కొక్కదినము మర్దించి మూసలోనుంచి యేడుపుటములువేసిన బాలసూర్యుని మించినటువంటి సింధూరమవును. కంచుసింధూరము ఇది శ్రేష్ఠమని అధికులు సంతోషింతురు. అల్లపురసాన అనుపానముజేసి అడ్డిగెత్తు ఔషధము నిత్యమున్ను ఈభస్మము తిన్నవారికి పాపము హరించిపోవును.

## 63. వంగనాగముశుద్ధి.

సీ. వంగనాగముశుద్ధి పరగెడుభస్మము అజమూత్రమునుచల్ల యావుపాలు
నులవనీళ్ళనునూనె యుస్త్రియాకురసాన నుడికించినశుద్ధి యుత్తమమవు
పత్రితాళకమును పాలాశరసమున నూరిరేకులరాచి తోరముగను
మూకుడులోబెట్టి మూతమూకుడుగప్పి పుటమొండువేయుడీ పొల్పుగాను
గీ. సాంగశీతలమునదీసి చక్కగాను, పాళ్ళకును భస్మమునుంచ బాటియగును
అరయవింశతిమేహము లంతరించు, విష్ణుభైరాగితో బల్కె విశదముగను.

తా. వంగము సీసము శుద్ధిభస్మప్రకారము ఏలాగంటే మేకపంచితమును మజ్జిగయు ఆవుపాలును ఉలవనీళ్ళను నూనెయును ఉస్త్రియాకురసమును వీట్లచేతను ఉడికించిన శుద్ధియగును పత్రితాళకమును మోదుగచెక్క రసమునునూరి తగరపురేకులకునిండ రాచి మూకుడులోపెట్టి పైన మూకుడు మూతగప్పి ఒకపుటమువేసిన భస్మమవును. చల్లారినతర్వాత తీసిన ఔషధముపాళ్ళకు అనుకూలముగా నుండును. ఇరువదిమేహములకు పెట్టవచ్చును.

## 64 వంగసింధూరము.

సీ. వంగసింధూరము వరుసమీ కెరిగింతు అజమోదరసమును నడ్డసరము
బోడసరమ్మును బోసిమర్ధించియు తమలపాకురసాన తరచినూరి
ప్రమిదలోబెట్టియు ప్రమిదమీదనుగప్పి నాలుగుపుటములు నయముతోడ
వరుసగావేసిన వంగసింధూరమా జనులెవ్వరునుదిన్న జాడ్యములను
గీ. మూత్రకృచ్ఛ్రము మేహముల్ మూలవ్యాధితాపమునగక్త కాసయుతంద్రిగుణము
ఇన్నిరోగంబులనుదియి యుడంచు, విష్ణుభైరాగితో బల్కె విశదముగను.

తా. తగరము సింధూరముచేయు ప్రకారము చెప్పెద ను. వాము, అడ్డసరమును బోడసరమునుబోసి మర్దించి తమలపాకు రసానమర్దించి ప్రమిదలోబెట్టి పైనిమూసి న్నా పుటములు వేసిన నిది వంగసిందూరము. ఇది మెవరుపుచ్చుకొన్నను జాడ్య ములు మూత్రకృచ్ఛరోగములును మేహరోగములును, మూ లవ్యాధులును, తాపములును రక్తకాసలును తంద్రిగుణము లును ఇన్ని రోగములకును ఇది యియ్యవచ్చును.

65 రజితభస్మయోగము.

సీ. వెండియురేకులు వేయించిపలుచగాఁ బోతుకాకరరసము దగఁదీసి
ఆరేకులన్నియు నారసమ్మునఁగాల్చి మంచినశుద్ధియగా నంచితముగ
కాకమాక్షికమును గల్వంబులోఁబెట్టి యర్కక్షీరముతోడ నరయనూరి
యారేకులకునిండ నంటించియార్చియు మూకుడులోఁబెట్టి మూతగప్పి
గీ. గజముపొడవునపుటమును గట్టిగాను। వేసినను వెండిభస్మమా వేగముగను
అద్దిభక్షింపుమన్నను నఘముబాయు। విష్ణుభైరాగితోఁబల్కె విశదముగను

తా. వెండి రేకులు పలుచగా వేయించి పోతుకాకర దుంప రసముదీసి ఆ రేకులన్నియు ఆరసములోపల ముంచికాల్చి నశుద్ధియవును. కాకమాక్షికము జిల్లేడుపాలతోనూరి ఆరేకు లకు పట్టించి ఆర్చిమూకుడులోనుంచి మూతగప్పి గజపుటము వేసిన భస్మమవును. ఈవెండిభస్మమును దినిన పాపములు పోవును.

66 శుద్ధిజేసినగంధకము పుచ్చుకొనుప్రకారము.

సీ. పార్వతీపింము పరిశుద్ధిగాజేసి త్రిఫలము లేలనల త్రికటుకములు
... గాను యు గంధకమునఁగల్పి మురతుం ... గాఁగ హద్దుజేసి

అనుదినంబును నాజ్యమనుపానములనిది యనుభవించఁగవలె హర్షముగను
పప్పునన్నము నేయి పాలును పెరుగును పలుచనిచారునుపథ్యమిదియు

గీ. మండలము సేవజేసినమానవులకు| కుష్టువ్యాధులురోగముల్ కూలిపోవు
నాయురారోగ్యమైశ్వర్యమధికమగుచు|విష్ణుబైరాగితో జెప్పెవిశదముగను.

తా. గంధకము పరిశుద్ధినిజేసి కరకకాయలు, తాడికాయలు, ఉసిరికపప్పును, ఏలకులును, శొంఠిపిప్పలిమిరియములును ఇవి యన్నియు చూర్ణముచేసి గంధకములోగలిపి రోజునకు అరతులమువంతున రేపుమాపును నిర్ణీతముచేసి నిత్యమునునేతితో అనుపానము చేసికొని పుచ్చుకొనవలెను. పప్పు, అన్నము, నేయి, పాలు, పెరుగు, పలుచని చారునుపథ్యము. నలుబదిరోజులు ఈలాగున పుచ్చుకొనినవారికి కుష్టురోగములుమానును. ఆయువును, ఆరోగ్యమును, ఐశ్వర్యమును అధికమవునని విష్ణువు స్పష్టముగాఁ జెప్పినాడు.

ఇది బయిరాగి చేసిన ధన్వంతరి విజయమునఁ

తృతీయాశ్వాసము. శ్రీ. శ్రీ. శ్రీ.

SREE VEMANA ANDHRA BHASHA NILAYAM
శ్రీ వేమన
ఆంధ్ర భాషా నిలయము
HYDERABAD-DN.

# చతుర్థాశ్వాసము.

---

## 67 సూతికాభరణము.

సీ. తాళకమునునాభి తామ్రముమణిశిల పార్వతీంద్రియమును పారదమును
అమృతవంగములోహమభ్రనాగంబును హేమటంకణకాంతహింగుళములు
శొంఠిపిప్పలిమిర్య సోపునేపాళము తారభస్మమునీలి తప్పిటమును
శంఖితుత్థక్షార జాజీఫలంబులు మత్స్యకూర్మమయూర మనుజమకరి
ఛాగశార్దూలము శశవిధచేదుల సమభాగములుగూర్చి సంఖ్యతోను
కల్వంబులోనుంచి ఘనమేఘనాదము చిత్రార్ధజంబీర శ్రీతులసిని
అయిదుపూటలునూర నమృతమవునుమాష మాత్రప్రమాణము మాత్రగాని
గీ. శూచికావాతసర్వాంగ శుష్కవాత, పక్షవాతము తాపముల్ పారిపోవు
సూతికాభరణమ్మిది శుభముకలది విష్ణువైరాగితో బల్కె విశదముగను.

తా. తాళకమును, వసనాభియు, తామ్రభస్మమును, మణిశిలయును, గంధకమును, పాదరసమును, గరళమును, తగరభస్మమును, లోహమును, అభ్రకభస్మమును, సీసభస్మమును, బంకారపు భస్మమును, వెలిగారమును, కాంతభస్మమును, ఇంగిలీకమును, శొంఠిపిప్పలి మిరియములును, నేపాళములును, వెండిభస్మమును, నీలిమందును, సత్తుభస్మమును, శంఖభస్మమును, మయిలుతుత్థమును యవాక్షారమును, జాజికాయలును, చేపచేదును, తాబేటిచేదును నెమలిచేదును, మనుష్యులచేదును, మొసలిచేదును, మేకచేదును, పెద్దపులిచేదును చెవులపిల్లి చేదును, దున్నపోతు చేదును, ఇవి యన్నియు సమ

భాగములుచేసి కల్వములోనుంచి నెమలిచెక్కరసమునను త్రిఘూలపురసమునను, అల్లపురసమునను, నిమ్మపండ్లరసమునను, తులసిరసమునను, ఈ అయిదురసములతో యిరుదిన ములు మర్దించిన అమృతముతో సమానమగును. మినపగింజంతమాత్ర పుచ్చుకొనిన సూచికావాయువులు, శుష్కవాతములును, సర్వాంగవాయువులును పక్షవాతములును, పారిపోవును. ఇది సూతికాభరణము.

## 8. వాతరాక్షుస

సీ. తామ్రిలోహసువంగతారభస్మసువర్ణ భస[illegible] యు
కాం[illegible] ంధకములు కఫరిసేపాళముల్ సమ[illegible]
క[illegible] టు. త్రి[illegible] ముల మ[illegible] ంచికుప్పె నమరగ[illegible]
[illegible] ట్టి [illegible] ప [illegible] ట్టి యి[illegible] కచుట్టునుబోసి యిష్టముగ
పదునా[illegible] లు పక్వంబుగావండి దేహానుపానంబు తెలిపినొంది
గీ. అడ్డిగెత్తునుపూటకు నమరనిడిన వాయురోగంబులన్నియు వదలిపోవు
శోభలును కాసశూలలు సొంపులగుచు| వాతరాక్షసమిదియును వాడిగలది
విష్ణుబైరాగితోఁజెప్పె విశదముగను.

తా. తామ్రభస్మమును, తగరభస్మమును, లోహభస్మమును, వెండిభస్మమును, బంగారుభస్మమును, పాదరసమును, కర్పూరమును, ఇంగిలీకమును, సింధూరమును, భ్రికభస్మమును, కాంతమును, గంధకమును, పాలతుత్తమును, నేపాలశొంఠి పిప్పలిమిరియాలును, రసముదీసి మర్దించి గాజుకుప్పెలోను పెట్టి కుప్పె కుండలోపె[illegible] కుప్పెచుట్టు యిసుకబోసి పదునారుగడియలు వండి దేహము అనుపాన[illegible] గు[illegible]రిగి ఔషధము అడ్డి

గెత్తు పూటకిచ్చిన వాయురోగములు మానును శోభలును శ్వాసలును శూలలును మానును వాతరాక్షసము ఇది మహా వాడిగలది.

## 69. ఆనందభైరవి.

సీ. చక్కనిహింగుళ చనుబాలనుడికించి పాళ్ళురెండుఁబెట్టి పగిదిగాను
శుద్ధిచేసినయట్టి శూద్రనాభియుపాలు పండుటంకనమొక్క పాలునల్ల
మిరియాలునొకపాలు మేలుగాఁజేరిచి జాజిఫలముపాలు చక్కగాను
నెమ్మికల్వమునను నిమ్మపండ్లరసాన మర్దించిమాత్రలమరఁగఁజేసి
గీ. మూఁడుదినములనిచ్చినముదము మీఱఁ|కడుపునొప్పులు గ్రహణులుకఫములడఁగు
బలిమిగలిగించు నానందభైరవమున| విష్ణుబైరాగితోఁజెప్పె విశదముగను.

తా. ఇంగిలీకము చనుబాలనుడికించి అదిరెండుపాళ్ళు శుద్ధిజేసిన శూద్రనాభిపాలు, శుద్ధిజేసిన వెలిగారమొకపాలు, నల్లమిరియములొకపాలు, జాజికాయ ఒకపాలు ఇవియన్నియు కల్వములోఁబోసి నిమ్మపండ్లరసమున నొకదినము మర్దించి మాత్రలుచేసి దినత్రయము ఈయౌషధము పుచ్చుకొనిన కడుపు నొప్పులు, గ్రహణిరోగములును మానును.

## 70. సన్నిపాతభైరవి.

సీ. బంగారురేకులంబరగెడుతాళక మొకపాలుబెట్టిన నొప్పుగాను
పార్వతివీర్యము పాలుకుబెట్టియు సూతంబునొకపాలు సూటిగాను
మూఁడుపాళ్ళనునాభి ముదమొప్పగాఁబెట్టి యొఱ్ఱనిమణిశిలయేకపాలు
పొంగినటంకంబుపాసఁగనొకపాలు నిన్నిటికిసమమ్ము హింగుళమును
నెమ్మిశుద్ధినిజేసి మ్మపండ్లరసాన రెండురోజులునూరి రేయుఁబవలు
ఓమంపురసమున నొకరోజుమర్దించి యంత్రానజాముసేపమరవండి
పూటకుచిన్నము పుచ్చుకొనుచున్న దగ్గనుహిక్కయు దాపములును

గీ. కడుపునొప్పులనుమాన్పుకఫములణఁచు|విషమజ్వరములు దోషముల్వెరిగి
సన్నిపాతము భైరవిసంఘులణఁచు| విష్ణుబయిరాగితోఁబల్కె విశదము. న.

తా. బంగారుతో సమానమయినటువంటి తాళకము ఒకపాలు ఉంచి గంధకము ఒకపాలు పెట్టి పాదరసము ఒ పాలు మూఁడుపాళ్ళు నాభియుంచి, మణిశిల ఒకపాలు, పొంగిం వెలిగారము ఒకపాలు వీని అన్నిం యెత్తు నింగిలీకముంచియివి యన్నియు కల్వములోనుంచి నిమ పండ్లరసాన రాత్రి బవళ్లు రెండురోజులు నూరి చిత మూలంసాన ఒకదినము మర్దిం డోలాయంతా న వండి పు పూటకు ఔషధ పుచ్చుకొనిన దగ్గును, హిక్కయును, తల వాయు ఎము ను, క ొప్పులు మాన్పును. కఫరోగములును, మజ ులు. ాయును. ఇది సన్నిపాతభైరవి.

## 71 షడ్గుణము.

సీ. ఒకపాలునూతము నొకపాలు ుము నొకపాలుగంధక మొప్పగాను
మూఁడుమూఁడునుపాళ్ళు ముదమొప్ప గాఁజేసి కల్వానమర్దించి గట్టిగాను
కుప్పెలోఁబోసియు కుప్పెకుండను బెట్టి యిసుకచక్కగఁజుట్టియెసఁగఁజేసి
కుండపొయిమీఁదను కుదురుగానిల్పియు గడియగడియమంట క్రమముగాను
వేయు షడ్గుణమది వేగమునయిదుయుంచు శీతలమున దీయ శీఘ్ర గను
ఔషధంబునుదీసి యల్లపురసముతో కుప్పెగాఁజే. యుఁ గూగ ొడ్డ
కన్నెకోమలిపాడి కలియంగఁబోసియు నావునేతమునది యడ్డిగెత్తు
గీ. అనుభవించినవ్యాధులుహతములౌను|చర్దిరోగముతు యలుశ్లేష్మములు మొుల
ఉబ్బుపాండువులుదరము లుండపెరము| విష్ణుబైరాగితోఁజెప్పెవిశదముగను.

తా. ఒకపాలు పాదరసము, ఒకపాలు సీసము, ఒకపాలు గంధకము, ఈమూఁడును మూఁడుపాళ్లుచేసి కల్వములోనుంచి,

మర్దించిన చూర్ణము గాజుకుప్పెలోఁబోసి కుప్పెకుండలోఁబెట్టి యిసుక కుప్పెచుట్టుబోసి కుండపొయిమీఁద బెట్టి పదిగడియలు మిక్కిలిగామంట బెట్టిన షడ్గుణమైయుండును. చల్లారినతరువాత కుప్పెతీసి చిల్లిగొట్టి ఔషధముతీసి అల్లపురసాననూరి కుప్పె చేసి యీఔషధములో కన్నెకోమలిచూర్ణము కలిపి ఆవునేతిని అనుపానముచేసి అడ్డిగెతు ఔషధము అనుభవించిన వ్యాధులు హరించిపోవును. చర్మరోగములు, క్షయరోగములు, శ్లేష్మరోగములు, ఉబ్బు, పాండువును ఉదరములు మొదలయిన రోగములు మానును.

## 72. సూతాదిలోహము.

సీ. దరదపారదలోహ తామ్రాభ్రసింధూర కర్పూరకాంతము గంధకమును
కరకకాయపొడి గల్పియుపాలును అని రసంబుల నదికూడదినము
అల్లపురసమును ననుపానమునుజేసి పూటకు చిన్నము పుచ్చుకొన్న
ఆ వ్యాధులబట్టి హతమునుజేయును దేహమారోగ్యమై తేజరిల్లు
గీ. అమరులందరికమృతమై యబ్బినట్టి శిలను సూతాదిలోహము నిట్లుజేయు
మూలరోగంబులకునిది మూలమనుచు| విష్ణువైరాగితోఁబల్కె విశదముగను.

తా[illegible]ంగిలికమును, దరసమును, హమును తామ్ర భస్మము, అభ్రకభస్మమును, సింధూర[illegible]ను, కర్పూరమును, కాంతమును, గంధకమును, కరకకాయలచూర్ణము ఒక పాలుగల్పి చిత్రమూల[illegible]నగల్పి అల్లపురసమున అనుపానముజేసి పూటకు చిన్నమెత్తు ఔషధముచొప్పున పుచ్చుకొనిన అన్ని రోగములు కొట్టివేయును. దేహము ఆరో[illegible]

గీ. మూత్రకృచ్ఛ్రలు మేహముల్ మూర్ఛమొదలు, సకలవ్యాధులు మానంగఁజాలి
యుండు । మేటి మేహాంతకరసమ్ము మేలునిచ్చు, విష్ణుబైరాగితోఁబల్కె
(విశదముగను)

తా. ముత్యాలభస్మము ఒకపాలు పగడభస్మము రెండుపాళ్లు తామ్రభస్మము మూడుపాళ్లు సీసభస్మము నాల్గుపాళ్లు లోహము అయిదుపాళ్లు కాంతము ఆరుపాళ్లు అభ్రకసింధూరము ఏడుపాళ్లు, తగరభస్మము యెనిమిదిపాళ్లు, ఇవి అన్ని కల్వములో ఉంచి కర్పూరరసమునమూరి ఉప్పిరసమును, బూరుగరసమును చెరుకురసమును, ఉస్తి ఆకురసమును ఈ అయిదు రసముల మర్దించి పూటకు అడ్డిగెత్తు ఔషధము పుచ్చుకొనిన వాతమును, పైత్యమును, శ్లేష్మమును వణకు రోగములును పాండురోగములును, క్షయరోగములును పోవును. మూత్రకృచ్ఛ్రరోగములును, మేహరక్తరోగములును, మూర్ఛలును, సమస్తరోగములును, మానునటువంటి అధికరములు లేదు. ఈమేహాంతకరసము చాలమేలుచేయును. అని విష్ణుమూర్తి బయిరాగితో విశదముగాఁ బలికినాడు.

## 75 కాలకూటరసము

సీ. రుద్రులు — భీయురుసులును దరదము బుతువులు సూతము రూఢిగాను
దాతలుదారి దాతుపువస్తువుల్ పార్వతివీర్యము బ్రాహ్మణులను
మద్రిచిమణిశిల సంధియు త్రిఫలము కరకంఠనేత్రముల్ — లును
నూ — చంద్రుడు శుద్ధి — ము వేడిటంకణమును వేదములను
పంచమూలరసానపంచదినమ్ములు — ంచినంజాలమహిమగలదు

కాలకూటరసంబుగలిగెనటంచును గరళకంఠుడు మెచ్చెఘనముగాను
ఆర్ద్రికశొంఠిరసాన్వితౌషధమును ననుదినమును దీనిననుభవింప
గీ. గళపురోగముగవలునుగండమాల,వాయువులుక్షయలు సంధులువాంతిజాడ్య
పక్షఘాతంబుతాపముల్ పారిపోవు, విష్ణుబైరాగితోబల్కె విశదముగను.

తా. పదకొండుపాళ్ళునాభిఉంచి ఏడుపాళ్ళు ఇంగిలీకము పాదరసము ఆరుపాళ్లుంచి తొమ్మిదిపాళ్ళుతాళకముంచి ఎనిమిది పాళ్లు తామ్రభస్మ ౦చి అయిదుపాళ్లు గంధకముంచి ఆరుపాళ్లు మణిసిలయుంచి మూడుపాళ్ళు కరకతాడి యుసిరికలు మూడుపాళ్ళు శొంఠి పిప్పలి మిరియాలు రెండుపాళ్లు నేపాలమును ఉంచేది నా పాళ్ళు పొంగించినవెలిగారము చిత్రమూలమును జిల్లేడువేరును ములగవేరును వరగోగువేరును దుష్టపువేరును అల్లపురసమును ఈరసాలను అయిదుదినములుమర్దించిన మహిమగల కాలకూటరసము ఘనమైనటువంటిదని ఈశ్వరుడు మెచ్చెను. అల్లపురసమును శొంఠిరసమును అనుపానము జేసి యీయౌషధమును నిత్యమును అనుపానముచేసి పుచ్చుకొనిన గళరోగమునుదగారోగములును గండమాల రోగములు వాయువులు క్షయలు సన్నిపాతములు పక్షవాయువులును పమలును వాంతిజాడ్యములును ఈరోగములన్నియు పోవునని విష్ణుమూర్తి బయిరాగితోబలికినాడు.

## 76 యోగినీరసము.

సీ. హరునివీర్యమ్ము నమరశిలగంధము నాభియుసిరికయు నాగసరము
తాడిపిప్పలిమిర్య తాళకటంకణాల్ సమరసగాజేసి సరిగనివితము

వీటికిసగముగా విరియునేపాళము లలిభృంగి నిమ్మపండులరసాన
నాల్గువిధమ్ములు నయముగానూరియు మాపమాత్రలుచేసిమంచిగాను
గీ. వహ్నిరసమున నిచ్చినవాయువులును,కుటిలమెడలించిరోగముల్ కూలిపోవు
పరిజల కీరసమెప్పుడుప్రాణపదము, విష్ణుబైరాగితోఁజెప్పెవిశదముగను

తా. పాదరసమును, అమరశిలగంధకమును, నాభియు ను, ఉసిరికపప్పును, కరకకాయలును శొంఠియు తాడికాయలును పిప్పళ్ళును మిరియములును వెలిగారమును ఇవిసమముగా జేసి వీటికి అరసగము నేపాళములుంచి గుంటకలగరాకు రసమునను నిమ్మపండ్లరసమునను నాలుగురోజులు ఈరసముననూరి మాత్రలుచేసి వహ్నిరసముచేతను అనుపానముచేసియిచ్చిన వాయురోగిములును కుటిలము పడగొట్టివేయును. రోగములు కూలదీసివేయును. మానవులకు ఈయోగినీరసము ప్రాణపదము వంటిది. అని విష్ణుమూరి బైరాగితో విశదముగాబల్కినాడు.

## 77. లోహరసాయనము.

కత్తితుప్పతుల... గంధకమ్ము లమ్మ రజతమ్ముతులమును రసముతులము
కల్వంబులోనుం కలగరరసము సాంబ్రాణిరసమును సరసముగను
వజ్రివల్లిరసమ్ము వహ్నిగజ్జేయను కలబందయుల్లము కాకరాకు
పెసనీరసంబుల విడువకుండగచాల రెండురోజులునూరి రేయుఁబవలు
అదిబిళ్ళవలెజేసి యార్చిపెత్రిమిదఁబెట్టి ప్రమిదగప్పియుమన్ను పబలరాచి
గజ పొద్దుపుటమ్ము ఘనముగావే శీతలంబునఁదీసి శీఘ్రముగను
మునురసంబులనూరి ముదము రం నమదిన పథ మడిగెత్తు
గీ. అనుభవించినజ లమనమృతమవు ,మూలవ్యాధులుమాన్ను సుమా ముచిచ్చు
లోహరసాయనం బింపు విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. కస్తూరిచూర్ణము పాలు, గంధకముపాలు, వెండిచూర్ణముపాలు, పాదరసముపాలు, ఇవి కల్వములోనుంచి గుంటకలగరాకు రసమునను సాంబ్రాణిఆకు రసమునను నల్లేరురసమునను చిత్రమూలపు రసమునను గలజేరుఆకు రసమునను కలబందరసమునను కాకరాకురసమునను ఇన్ని రసములు రెండురోజులు రాత్రిందివములు మర్దించినూరి ఔషధము బిళ్ళగాజేసి ప్రమిదలోబెట్టి మీదను ప్రమిదగప్పి మన్ను దానిచుట్టగప్పి గజముపొడవున పుటమువేసి చల్లారినతర్వాత దీసి ముందుగా నూరిన రసములను మరలనూరి నిత్యమును అడ్డిగెత్తు ఔషధముచొప్పున పుచ్చుకొన్నవారికి అమృతముతో సమానమవును. మూలవ్యాధులనుమాన్పి సంతోషమునిచ్చును. లోకమందున లోహరసాయన మిదియని విష్ణుమూర్తి బైరాగితోఁ బలికినాడు.

## 78. ప్రతాపలంకేశ్వరము.

సీ. పారదాభ్రక … లు పార్వతివీర్యము మూడుమూడగుపాళ్లు ముదము … ర
దూడరేణముగాల్చి తోడనెభస్మము హరనేత్రములతోడ నమరనుంచి
తగభస్మమునుచేసి దగవేదములసరి త్రివిధసంఘులుజేసి తీ … లోహ
శూ … నా యుదెచ్చి శుద్ధిగాఁజేసి … ఎనువులుగా జే… వరుసగాను
నెమ్మి … … త్రన నిగఁడండిరసమున మర్దించియొక … డు మాపురేపు
గురివెంద … ల గురిగా మాత్రలు సల్పిసేవించిన జనులకెల్ల
స… పాతంబులు సమసి యొకనన్ని సప్తజ్వరంబుల … ంహరించు
గీ. శిర … ంబునువిడిపోవు శీఘ్రముగను కఠినరోగములను … కడకు … లు
కేవలం బ్రతాపలంకేశ్వరమును, … రాగితో బల్కె విశదముగను.

తా. పాదరసమును, అభ్రికమును, గంధకమును, ఈ మూడు మూడుపాళ్ళవును. పాలుకుడుచుచున్న దూడ రేణము కాల్చినభస్మము మూడుపాళ్ళు, శంకభస్మము నాలుగుపాళ్ళు, మూడుపాళ్ళు లోహము, శుద్ధిజేసిననాభి యెనిమిదిపాళ్ళు, ఈ వస్తువులు కల్వములోనుంచి వావిలాకురసమున నొకదినము మర్దనచేసి గురివిందగింజవలె మాత్రిలు చేసి పుచ్చుకొనిన మనుష్యులకు సన్నిపాతములును అన్నియుపోవును. ఏడుజ్వరములను కొట్టివేయును. శీతలము వదలిపోవును. కఠినరోగములను కొట్టివేయును. కేవలము ప్రాణమును ప్రతాపమును కలిగినటువంటిదని ఈపవిత్రాపలంకేశ్వరము, ఇంత మహిమగలదని విష్ణుమూర్తి బైరాగితో విశదముగాఁ బల్కినాడు.

## 79. కాంతవల్లభరసము. *

సీ. సొంపైనకాంతము షోడశభాగముల్ పటిమ లోహముపాళ్ళుపది యునాల్గు
మంచిమండూరమ మరద్వాదశాంశము లభ్రకంబు పాళ్ళు నారువాల్గు
నెన్నికతామ్రము నెనిమిదిపాళ్ళను నెఱ్ఱనిమణిశిల యొమ్మిదియును
పచ్చిటంకణమును పాళ్ళునునాలుగు వెండిభస్మముపాళ్ళు వెలయురెండు
బంగారుభస్మము పాలది ... టి ఈశ్వరవీర్యము నిన్నియెత్తు
గంధకమంతియె కల్వంగవలయును హంసపాదిలసాన నరయనూరి
గాజుకుప్పెను బెట్టి ఘనముగకుప్పెలో గురిగనిసుక ... సి కుప్పెఁబెట్టి
గీ. సప్తదినములు వండిన సరసముగను, కాంతవల్లభ సమవు కాంతిగ
సకలవ్యాధులనెల్లను సంహరించు, విష్ణుబైరాగిం బల్కె విశదముగ.

కాంతము పదునారుభాగములు, లోహము ప
నా ... గుభాగ ... లు, మండూరము పండ్రెండుభాగములు, అ

భ్రికము పదిపా. తామ్రిభస్మ మెనిమిదిపా. రక్తమణిశిల ఆరు భాగములు, పచ్చివెలిగారము నాలుగుభాగములు, వెండిభస్మము రెండుభాగములు, బంగారుభస్మ మొకపాలు, ఈవస్తువుల యెత్తు పాదరసము, గంధకము పాదరసముతో సమానముగ నుంచి యిది హంసపాదియాకు రసమున మర్దించి ఈఔషధము గాజుకుప్పెలోనుంచి కుండలో నిసుకపోసి గాజుకుప్పెతో ఇసుక మధ్యనుంచి యేడురోజులువండిన ఈ కాంతవల్లభరసము సమస్తరోగములను కొట్టివేయును. అని విష్ణుమూరి బైరాగితో విశదముగా బలికినాడు.

### 80 మృతోద్ధాపనరసము.

సీ. తామ్రటంకణలోహ తాళకభస్మముల్ మణిశిలగరళము మస్తకమును
అభ్రకనాభులు నమరశిలయుసజ్జ కారముయవసద్య క్షారములును
పంచలవణములు పాషాణములుమూడు చెంగల్వకోష్టును శివునివీర్య
కటుకత్రిరసముల కలయంగమర్దించి కుప్పెలోపలనుంచి కూర్మితోడ
వాలుకంబునజాము వరుసగావండియు కలువంబునందుంచి కలియనూరి
మత్స్యమెనోబ్బతును మాయూరమజకూర్మ పిత్తముల్ గల్పియు ప్రీతిగాను
దినమన్నిటదగమర్దించి దానిసదీసి గురువిందలంబలె గుళిగజేసి
గీ. అల్లమనుపానమున నిదియనుభవింప, నన్నిరోగములనుబాపియాయువిచ్చు
ఇదిమృతోద్ధాపనరసమై యిలనుజెలగు, విష్ణుబైరాగితోబల్కె విశదముగను.

తా. తామ్రభస్మము, వెలిగారము, లోహము, తాళకభస్మము, మణిశిలయు, గరళము, మస్తకియు, అభ్రకము, నాభియు, అమరశిలగంధకము, సజ్జాకారము, యవక్షారము, సద్యాక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, సముద్ర

లవణము, బిడాలవణము, కాచలవణము, ఇవి అయిదును, ఉల్లి పాషాణము, గౌరీపాషాణము, దొడ్డిపాషాణము, చెంగల్వకోష్టు, పాదరసము, శొంఠి, పిప్పలి, మిరియాలురసమును తీసి నూరి కుప్పెచేసి యిసుక కుండలోబోసి ఈ గాజుకుప్పె కుండలో నుంచి జామువండి కల్వములోనుంచి చేపచేదు, దున్నపోతు చేదు, నెమలిచేదు, మేకచేదు, తాబేలుచేదు, ఈ చేదులుగల్పి చిత్రిమూలరసమున ఒకదినము మర్దించి గురివెందపూసలంత మాత్రిలుచేసి అల్లపురసము అనుపానముజేసి పుచ్చుకొనిన అన్ని రోగములను కొట్టివేసి ఆయువునిచ్చును. ఈఔషధము మృతినొందుటకు సిద్ధముగనున్న వారిని బ్రతికించును అని చెప్పినారు.

## 81. పూర్ణచంద్రోదయము.

సీ. పాదరసంబును ఫలములునెనిమిది బంగారుభస్మము ఫలమునొకటి
పార్వతివీర్యము ఫలములుపదునారు నివిమూడుకల్వాన నిడుచుమరియు
కలబంతరసముప గట్టిగామర్దించి గాజుకుప్పెనుబెట్టి ఘనముగాను
వలయుభాండమ్మున వాలుకంబునుపోసి కుప్పెవాలుకమధ్య కూర్చిపిదప
భాండముపొయిమీద బాగుగానుంచియు మందవేదాగ్ని చే మంటనిడుచు
మూడుదినమ్ములు ముదమొప్పవండిన మంకెనపువ్వుసమముయియుండు
శీతలంబునదీసి శీఘ్రముగను కుప్పె విడజేసిమందును వెలయజేర్చి
గీ. ఆర్ద్రికరసంబుతోగల్పి యౌషధమును, ప్రజలుదిన్నను వీర్యముప్రబలమగును
పూర్ణచంద్రోదయ మెపుడుపూజ్యమనుచు, శిష్యు బైరాగితోబల్కె విశదముగను

ట. పాదరస మెనిమిదిపాళ్లు, బంగారుభస్మము పాలు, గం. కము పదునారుపాళ్ళు ఈ మూడును కల్వమునసుంచి కల

బంధ రసమున నూరి గాజుకుప్పెలో నుంచి గట్టికుండలో నిసుక బోసి యీగాజుకుప్పె యిసుకమధ్యనుంచి యీకుండ పొయిమీదనుంచి మందముగాను వడిగాను మంటవేసి యీలాగున మూడురోజులు రాత్రింబగళ్ళు వండిన మంకెనపువ్వుతో సమానమైన కాంతిగానుండును చల్లారిన తర్వాత తీసి కుప్పె చిట్లగొట్టి ఔషధము నొకపళ్ళెగములోనికి కూడతీసి కుప్పె చేసి అది అల్లపురసము అనుపానముచేసి ఆయౌషధము తిన్నవారికి వీర్యవృద్ధి యవును. ఈపూర్ణచంద్రోదయము మహా పూజ్యమయినటువంటిదని విష్ణుమూర్తి బైరాగితో విశదముగ బల్కినాడు.

## 82 హేమరజతరసాయనము.

సీ. కాంచనంబుఫలమ్ము ఖడ్గముఫలమును రజతముఫలమును రసముఫలము
పార్వతివీర్యము ఫలములునాల్గును నివికల్వమునసుంచి యింపుగాను
వజ్రివల్లిరసాన వహ్నిరసమ్మున నొకరోజుమర్దించి యుచితముగను
మూసలోబెట్టియు మూతమీదనుగప్పి గజపుటమువేయ గట్టిగాను
గీ. హేమరజతరసాయన మెచ్చుగాను, అడ్డిగత్తౌషధముదిన మనుభవింప
జడిసిపోవునురోగముల్ జనముగాను, విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. బంగారము పాలు కిటారిచూర్ణము పాలు వెండిచూర్ణము పాలు పాదరసము పాలు గంధకము నాలుగుపాళ్ళు ఇవి కల్వములోనుంచి నల్లేరు రసమును చిత్రమూలపు రసమును ఈరసములను ఒకదినము మర్దించి మూసలో నీయౌషధము పెట్టి పయిని మూతవేసి గజపుటమువేసిన హేమరజత రసాయనము అనుపేరుగలది అడ్డిగత్తు ఔషధము ప్రాటకు పుచ్చు

కొనిన రోగములు జడిసిపోవును అని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బల్కినాడు.

## 83. పైత్యాంతకరసము.

సీ. ఖర్జూరఫలమున కాంతియౌ వస నాభి ఘనమైనగరళము గంధకమును
సూతంబుహింగుళిశుద్ధి నేపాళము సొంటిపిప్పలియును సొంపుగాను
అక్కలకఱ్ఱయు నాభినుమిరియాలు వెలిగారమొకపాలు వేయవలయు
ఒనరవావిలిచేత నొకనాడుమర్దించి కలగరతోరోజు కలియనూరి
జంబీరరసమున జాముమర్దించియు మాసంబుసరిగాను మాత్రజేసి
మాపురేపును రెండుమాత్రలుచొప్పున మూడురోజులలోన ముఖ్యముగను
ఆరుసంధులు మానునరపుశోకవిషంపు జ్వరములు వ్యాధులువిరిగిపోవు
గీ. వాయువులు పైత్యవణకులువదలిపోవు, గుల్మరోగంబులన్నియు గూలిపోవు
నిదియు పైత్యాంతకరసమైయిలనుమించె, విష్ణుబైరాగితో బల్కె విశదముగను

తా. ఖర్జూరపుపండ్లతో సమానమయినటువంటి వస నాభియు గరళమును గంధకమును పాదరసమును ఇంగిలీకమును శుద్ధిచేసిన నేపాళమును శొంఠియు పిప్పళ్ళును అక్కలకఱ్ఱయును నల్లమందును మిరియాలును వెలిగారమును వావిలాకు రసమున ఒకరోజును ఒకదినము గుంటకలగరరసముతోను మర్దించి నిమ్మపండ్లరసమున జాముమర్దించి మినపగింజవలె మాత్రలుజేసి ప్రొద్దున ఒకటియు సాయంకాలమునందు ఒకటియు నీ పరిహారమిచ్చిన ఆరుసన్నిపాతములును విషజ్వరములును వ్యాధులన్నియుమానును. వాయువులును పైత్యరోగములును పోవును గుల్మరోగములునుపోవును. ఇది పైత్యాంతకరసమని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బల్కినాడు.

## 84. హిరణ్యగర్భరసము.

సీ. బంగారమును వెండిపగడాలు మణిశిల తామ్రకటుకారోహిణి తాళకములు
ఆజదుగ్ధమునుబోసి యరజాముసూరియు వజ్రిమూసనువై చివరుసగాను
పొడవైనపుట మొండుపొందుగావేసియు తీసిపాలను నదితిరుగనూరి
చక్కెరతగఁగల్పి సరిగసేవించిన కఫపిత్తద్వంద్వరోగములుమాను
గీ. శుక్లమేహామువాతముశూలలన్ని, శిరపురోగములునుబోవు శీఘ్రముగను
కలినిదగుచుండునుహిరణ్యగర్భరసము, విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. బంగారము, వెండియు, పగడములు, మణిశిలయు తామ్రము, కటుకరోహిణియు, తాళకము, మేకపాలుపోసి నాలుగుగడియలు మర్దించి వజ్రపుమూస అనగా ఘట్టమన్నానసకట్టి ఆర్చి మూసలోనుంచి గొప్పపుటమువేసి తీసి తర్వాతను పాలతోనూరి పంచదార కలుపుకొని పుచ్చుకొన్నవారికి శ్లేష్మరోగములును, పైత్యరోగములును, ద్వంద్వరోగములును మానును. శుక్లమేహములును, వాతములును, శూలలును, శిరోరోగములును పోవును. కలియుగమునకు ఈహిరణ్యగర్భరసము భుక్తిముక్తిని కలిగించునని విష్ణుమూర్తి బైరాగితో బలికినాడు.

## 85 శ్రీలక్ష్మీనారాయణరసము.

సీ. శ్రీఖండమునతామ్రమశిఖిదుగ్ధటంకణ తాళకములనైదుతప్పకుండ
సూటిమార్గములను శుద్ధులుచక్కగా సల్పిజాగ్రతగానుజనులుమీరు
కల్వములోనుంచి గలిజేయరసమున రెండురోజులునూరి రేయుబగలు
జాముయంత్రమునను సరిపండిమాత్రలు జేసిపూటకును రెండేసితిన్న
గీ. శీతజ్వరములకెల్లను శీఘ్రముగను, గట్టిగాబట్టుకొను వానిగర్వమణచి
లక్ష్మినారాయణరసంబు లక్షణంబు, విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. గంధకము, తామ్రభస్మము, మైలతుత్థము, వెలిగారమును, ఈఅయిదు సమభాగములుజేసి ఇవి జాగ్రత్తగా శుద్ధులుచేసి కల్వములోనుంచి గలిజేరురసమున రెండురోజులు రాత్రింబగళ్ళు నూరి, ఒకజాము డోలాయంత్రమున వండి మాత్రలుచేసి పూటకు రెండేసిచొప్పున నిచ్చినయెడల చలిజ్వరముల మదమును అణచివేయును.లఘుతరమయినటువంటిది. ఈలక్ష్మీనారాయణరసమును ఇంత మహిమగలదనివిష్ణుమూర్తి బైరాగితో విశదముగా బలికినాడు.

## 86. బ్రహ్మాస్త్రరసము.

సీ. పాషాణములుమూడు పాలతుత్థమునాభి అమరశిలయు గంధకాభ్రకములు
మణిశిలదరదము మంచినేపాళము సజ్జకారసైంధవ సజ్యక్షార
లఘుతరంబగుబిడా లవణముమిరియాలు యవక్షారటంకణా లందముగను
మాయూరతుత్థము మంచియింగువయును ఈశ్వరవీర్యము నిన్ని బెత్తు
అరపదిరోజులు ఆర్ద్రకవహ్ని సురసములమర్ధించి రాత్రిపగలు
నొకనాడుయంత్రాన నొగివండితీసియు మాయూరభాగసు మత్స్యకూర్మ
సర్పజంబుకముల సమపిత్తముల్ గొని నూరిబరిణబెట్టి తోరముగను
గీ. కత్తివాతేసి బ్రహ్మకపాలమందు, బెట్టిరాచినరోగముల్ బెదరిపోవు
అధికబ్రహ్మాస్త్రరసమిది యవనియందు, విష్ణుబైరాగితోబల్కె-విశదముగను.

తా. ఉల్లిపాషాణమును గౌరీపాషాణమును నెల్లిపాషాణమును పాలతుత్తము నాభియు అమరసిలగంధకమును అభ్రికమును మణిశిలయును ఇంగిలీకమును నేపాళమును సజ్జకారమును సైంధవలవణమును సద్యాక్షారమును బిడాలవణమును మిరియాలును యవక్షారమును వెలిగారమును మైలుతుత్తమును ఇంగువయు ఇన్నివస్తువులయెత్తు పాదరసమును అయిదురోజులు అల్లపురసమును చిత్రమూలరసమును అయిదుదినములు రాతి

బవలు మర్దించి ఒకదినము డోలాయంత్రమునవండి తీసి నెమలి చేదును మేక చేదును తాబేటిచేదును పాముచేదును నక్కచేదును ఈచేదులతో మర్దించి రాగిబరిణెలోనుంచి బ్రహ్మరంధ్రమందు పైని కొంచెము క త్రిపోట్లు వేసి ఆయౌషధము బెట్టిరాచిన రోగములు బెదరిపోవును. అధికమైనటువంటి బ్రహ్మాస్త్రరసమను పేరుగలదని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బలికినాడు.

### 87 రాజౌషధము.

సీ. పాషాణములునుల్లి పాషాణమునుగౌరి పాషాణమునురెండు పాళ్లురెండు
నాల్గురసంబులు నాలుగుపాళ్ళను హరిదళమ్ముగూడ నమరగాను
తాళకమొకపాలు తామ్రముపాలును మణిశిలపాలును మంచిదిగను
నెల్లిపాషాణము నెరినొక్కపాలును గంధకమునుపాలు గలుపవలయు
కల్వానవియున్న గట్టిగామర్దించి ఆపయిమూసలో నదియుబోసి
ఆపీనుబిల్లయు నాపైనిమూసియు మూకిటిలోబెట్టి మూతగప్పి
గడియదీపాగ్నిని ఘనముగావండిన నరయరాజౌషధంబమరియుండు
గీ. నేలమలుజీలకఱ్ఱయు నివియుదీని। నేతగల్పుకతిన్నను నేర్పుగాను
సఃఖమునంగల్గుజాడ్యముగ్రుసుక్కననుచు। విష్ణుబైరాగితోబల్కె విశదముగను.

తా. ఉల్లిపాషాణమును, గౌరీపాషాణమును, రెండును రెండుపాళ్ళు పాదరసమును, కర్పూరమును, ఇంగిలీకమును, సింధూరమును, నాలుగురసములు నాలుగుపాళ్ళు తాళక మొకపాలును, తామ్రభస్మము పాలును, మణిశిల పాలును, నెల్లిపాషాణముపాలును, గంధకము పాలును, ఈవస్తువులు కల్వమునబెట్టి మ౦చి నల్లమందుమూసచేసి ఆమూసలోపోసి, నల్లమందు కొంచెము బిళ్ళచేసి మూసమీదనువేసి ఆమూస మూకుటిలోఁ

బెట్టి పైని మూకుడు మూసి సీలమన్ను నిచ్చి గడియదీపాగ్ని చేత వండిన, అధికమయినటువంటి రాజౌషధమను పేరుగలిగిన సుఖము కలదియౌను. ఈరాజౌషధమునకు ఏలకలును, జీలకఱ్ఱయును, నేత్రితోఁగలిపి పుచ్చుకొనిన సుఖజాడ్యములు సవాయి మొదలగు రోగములు జ్వరములు మానునని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బల్కినాఁడు.

## 88 బాలసూర్యోదయము.

సీ. అభ్రికసింధూర మైదుభాగంబులు పార్వతివీర్యము పాళ్ళుమూఁడు
దరదమారునుపాళ్లు తామ్రముపాలును ముదముప్పలోహము మూఁడుపాళ్లు
గవ్వలభస్మము గలిపియునొకపాలు నాభియుంపాలును నయముగాను
పదిజాములును నిమ్మపండ్లరసమ్మున మర్దింపభాస్కరు మహిమగలిగి

గీ. బాలసూర్యోదయంబగు బాగుమీర । నల్లమనుపానముగదిన్న నౌషధమును
అధికరోగాదులంబట్టి హతముజేయు । విష్ణుబైరాగితోబల్కె విశదముగను.

తా. అభ్రికసింధూరము అయిదుపాళ్ళు గంధకము మూడుపాళ్ళు ఇంగిలీకము ఆరుపాళ్ళు లోహము మూడుపాళ్లు గవ్వభస్మముపాలు నాభి పాలు నిమ్మపండ్లరసముచేతను పది జాములు మర్దనజేసిన సూర్యునితో సమానమయినటువంటిపరాక్రమమునుగలదై బాలసూర్యుఁ డుదయించినట్టుగానే యుండును. ఈఔషధము అల్లపురసము అనుపానముజేసి యిచ్చిన అధికమయినటువంటి రోగములను కొట్టివేయును. అని విష్ణుమూర్తి బైరాగితో చెప్పినాఁడు.

ఇది బైరాగిచేసిన ధన్వంతరివిజయమునఁ
జతుర్థాశ్వాసము
పూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

SREE VEMANA A[illegible]
శ్రీ వేమన
ఆంధ్ర భాషా నిలయము
దక్షిణ హైదరాబాద్
[illegible]